# యథార్థవాది

కొడవటిగంటి కుటుంబరావు




ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

ప్రథమ కూర్పు 1956
ముద్రణ
జయశ్రీ ప్రెస్, విజయవాడ.

వెల : ఒక రూపాయి

సంపాదకుడు :
గద్దెలింగయ్య

# యథార్థవాది

## మొదటిరంగం

[సీతాపతి ఇల్లు. సాయంకాలం అయిదుగంటల వేళ.
సీతాపతి, డాక్టరు రామమూర్తి మాట్లాడుకుంటున్నారు.]

సీతా: అయితే నువు ఇంగ్లండులో వున్న సంవత్సరకాలంలో చాలా విచిత్రమయిన డ్రగ్గులు పరిచయం చేసుకున్నా వన్నమాట.

రామ్మూ: కాని వీటిల్లో చాలాభాగం ప్రమాదకరమైనవిరా, సీతాపతీ. ఎంతో నిపుణులు ఎంతో జాగ్రత్తగా పరిశీలిస్తే తప్ప వాటివల్ల ప్రయోజనం ఉండదు. కొన్ని డ్రగ్గులు మనస్తత్వంలో తాత్కాలికంగా వింతమార్పులు తెప్పించ టానికి తప్ప ఇంకెందుకూ పనికిరావు.

సీతా: అటువంటివిచిత్రమైన డ్రగ్గు లేవైనా నీవెంట తెచ్చావా?

రామ్మూ: లే—దు—

సీతా: నీ వాలకం చూస్తే తెచ్చినట్టే ఉన్నావు.

రామ్మూ: నీ దగ్గిర దాపరికం దేనికిగాని, ఒక విచిత్రమైన డ్రగ్గు ఒకటి తిరిగివచ్చాక ఇక్కడే తయారుచేశాను—

సీతా: నువే?

రామ్మూ: అవును. ఆశ్చర్యపడకు. ఇది అచ్చుగా నేనొక్కణ్ణే కనిపెట్టినదికాదు. ఇంగ్లండులో ఒక విచిత్రవ్యక్తి వున్నాడు? ఆయన అసలుపేరు చెప్పను. మాటవరసకి ఆయన పేరు మిస్టర్ టర్పిన్ అందాం. ఈ టర్పిన్ తాత, డాక్టరు పరిశోధకు.

చదివి డిగ్రీ పొందకుండానే మూలికలతో వైద్యంచేసి కొన్నికొన్ని రోగాలను అమోఘంగా నయంచేస్తూండే వాడు. ఆయన ప్రాక్టీసు చాలా జాస్తికావటం చూసి డాక్టర్లు కొందరుచేరి ఆయన్ని జైలుకు పంపించారు. నేను చెప్పిన టర్పిన్‌కు చిన్నతనంలోనే తండ్రిపోతే తాతదగ్గిర పెరిగాడు. ఈ టర్పిన్ ఇప్పుడు నడివయస్సు దాటుతున్న వాడు. మా ఇద్దరికీ పరిచయమైన తరవాత నన్ను మన నాటుమందులను గురించి ఊసుపోకకి అడిగినట్టుఅడిగాడు. వస్తుగుణదీపికలో విచిత్రంగా కనిపించిన కొన్ని వస్తు గుణాలు ఆయనకు చెప్పాను. అంతా శ్రద్ధగా విన్నాడు. తరవాత కొద్దిరోజులకు నన్నాయన తన ఇంటికి భోజనానికి పిలిచాడు. ఆయన ఇంట్లో ఒక గది ఫస్టు రసాయనశాల—రిటార్టులు, పిపెట్లు, బ్యూరెట్లు వగైరాలతో సహా! వివరాలన్నీ చెప్పి నిన్ను వేధించటం దేనికిగాని, ఆయనా నేనూ కలిసి ఒక డ్రగ్గు సృష్టించాం. దాన్ని చెప్పకుండా కొందరి మీద ప్రయోగించాం. అది ఎంత మాత్రమూ ప్రమాదకరమైనదికాదు. దుష్ఫలితాలు, మేం గమనించినంతవరకూ ఏమాత్రమూ లేవు. కాని ఉన్న ఫలితం ఒకటే అతి విచిత్రమైనది. ఆ డ్రగ్గును మంచి నీటిలో కలిపి ఇస్తే కొద్దిగా వాసన పట్టేస్తుంది. కాని కాఫీలో కలిపితే కనుక్కోవటం అసాధ్యం. టర్పిన్ ఒక కుటుంబాన్ని కాఫీకి పిలిచాడు. భార్యా, భర్తా, ఇద్దరు పిల్లలూనూ. మేమిచ్చిన కాఫీ తాగిన రెండునిమిషాలకి భార్యాభర్తలు ఒకరినొకరు నిష్ఠూరాలాడుకోసాగారు.

వారంత ఆదర్శ దంపతులు లేరని అంతా అనుకునేవాళ్ళు ఒకరిమీద ఒకరు ఆరోపణలు చెయ్యసాగారు. పిల్లల్లో మాత్రం దాదాపు మార్పేమీ లేదు.

సీతా : వాళ్ళు పోట్లాడుకోవటానికి కారణం ?

రామ్మూ : మాడ్రగ్గే ! అది తీసుకున్నవాళ్ళు నిజం దాచుకోలేరు. నేను చెప్పిన భార్యా భర్తలు తమ వివాహం అయినాక ఇతరులను ఎవరెవరిని ఎప్పుడెప్పుడు ప్రేమించినదీ చెప్పేవారు. వింటున్న మాకు ఘోర మనిపించింది. ఇటువంటి డ్రగ్గులు తీసుకున్న తరవాత నెలలతరబడి వాంతులు వచ్చి, కీళ్లు పట్టుకుపోవటం ఘోరమా, ఈవిధంగా కడుపులో ఉన్న రహస్యం బయటపెట్టుకోవటం ఘోరమా అంటే ఇదే ఘోరమంటాను.

సీతా : అదేమిట్రా రామ్మూర్తీ. ఈ డ్రగ్గును గురించి నువ్వు చెప్పేది నిజమైతే నిజం తెలుసుకోవటానికి గొప్పసాధనం కద ? మాటవరసకు హత్యలూ అవీ జరిగినప్పుడు హంతకులచేత నిజం చెప్పించటానికిది అమోఘంగా పనికొస్తుందిగద.

రామ్మూ : ఆ డ్రగ్గు నిజమే చెప్పిస్తుందని నాకు తెలుసు. కాని అందరికీ తెలిసేదెట్లా ? కొన్ని కేసులలో బహిరంగంగా ప్రయోగించాలి. అదే ప్రమాదకరం. అక్కడే ఉన్నచిక్కంతా. నా మటుకు నాఅంతరాత్మలో నే నెరుగుదును—ఈ డ్రగ్గు ఎటువంటివాడిచేతనైనా నిజం ఒప్పిస్తుంది. ఈప్రపంచంలో యథార్థవాదిఅనదగినవాడుండటం సాధ్యంకాదు. ఎందుకంటే ఒకరిని గురించి యథార్థం చెప్ప

గలవాడు మరొకరినిగురించి చెప్పటానికి ఒప్పుకోడు. ఈ డ్రగ్గు అట్లా కాదు. దీన్ని ఎవరికిచ్చినా వాడిచేత సత్యం పలికిస్తుంది. ఇదే అసలైన యథార్థవాది. అందుకే ఇది లోకవిరోధి.

సీతా (అనుమానంగా) అవునూ, నువ్వన్నట్లు ఈ డ్రగ్గు నిజమే చెప్పిస్తున్నదని నీకుమాత్రం రుజువేదీ?

రామ్మూ : (నవ్వి) పిచ్చివాడా, నేనే దీన్ని రెండుసార్లు తీసుకున్నాను. దీనివల్ల దుష్ఫలితాలుండవని రుజువుచేసుకోవటానికి ఒకటీ, ఇది మెదడుమీద ఎట్లా పనిచేస్తుందో తెలుసుకోవటాని కొకటీనూ.

సీతా : (ఆత్రంగా) చెప్పవేం? ఎట్లా పనిచేసిందిరా?

రామ్మూ : రెండుసార్లుకూడా ఒంటరిగా, ఇంట్లో ఒకణ్ణే ఉన్నప్పుడు, తలుపులు గడియవేసుకుని తీసుకున్నాను. దాని ప్రభావం ఇరవై నిమిషాల్లో ప్రారంభమయినట్లు కనబడింది. తత్వాన్నిబట్టి ఇంకా ముందుగానూ, అంతకన్న ఆలస్యంగానూ పనిచెయ్యవచ్చునేమో, గాని ప్రభావంలో మనసు మామూలుకన్న నిర్మలంగా ఉన్నట్టుంటుంది. మాట్టాడబుద్ధిఅవుతుంది. నేను పైకె మాట్లాడేశాను — వినేవాళ్ళు లేకపోయినా. చివరకు రాద్దామని ఆలోచన తట్టింది. కాగితం కలం తీసుకుని గబగబా రాయసాగాను. మూడుగంటలో నాలుగుగంటలో రాశాను. తరవాత క్రమంగా ఎఫెక్టు తగ్గిపోసాగింది. ఇంతకీ నేను రాయటం అనవసరమే అయింది. ఎందుచేతనంటే నేను రాసిన ప్రతి

అక్షరమూ నాకు తరవాతకూడా జ్ఞాపకం ఉంది. నేనా రెండుపర్యాయాలు రాసినదికూడా నువ్వు వీలున్నప్పుడు చదువుదువుగాని. మరొకరికైతే చూపించేనుసుమా. ఇతరులు చూడగూడనిది అందులో చాలా ఉంది. జ్ఞాపకం ఉంచుకో—ఆ సమయంలో నాదగ్గిర ఎవరైనా ఉంటే అందులో ప్రతి అక్షరం పైకి అనేసి ఉండేవాణ్ణి. డ్రగ్గుయొక్క మహాత్మ్యం నీకు పూర్తిగా అర్థమయిందికాదూ? అది పని చేస్తున్నంతసేపూ, ఇది దాచవలసిన విషయం. దీన్ని పైకి అనకూడదు అన్న భావమే ఉండదు. దాని ప్రభావంచేత మాట్లాడినవారికి ఆ భావం తిరిగి వచ్చేశాక అంతా మించే పోతుంది. క్రూరంగా నిజం మాట్లాడే సాక్రటీస్ లాటివాళ్ళ రక్తంలో ఈ పదార్థం దానికదే తయారవుతుందేమో.

సీతా : (ఆలోచనగా) ఓహో! అదా—సం—గ—తీ! ఆ డ్రగ్గును గురించి నువ్వంత దారుణంగా ఎందుకు మాట్లాడుతున్నావో నాకిప్పు డర్థమయింది...ఇంతకీ ఈ డ్రగ్గు తీసుకుంటే నోటంట వచ్చేదంతా పచ్చి నిజమేనా?

రామ్మూ : (నవ్వుతూ) నేనంటే కేవలం డాక్టర్నుగాని, నువ్వు రాతగాడివి, మేధావివి, తత్వవేత్తవు. నిజమన్నది తెలుసుకోవటానికి తరతరాల విజ్ఞానం కావాలి, మేధస్సు కావాలి. వాటిని ఈ డ్రగ్గు సృష్టిస్తుందా? వట్టిమాట. కాని మనిషి అంతరాత్మకు నిజంగా తోచినదాన్ని ఈ డ్రగ్గు దాపరికం లేకుండా బయటపెడుతుంది. ఒకొక్కప్పుడు నీకు తెలియకుండా దాగిఉన్న నిజాన్నికూడా కుండపగలేసి బయటపెడుతుంది. కాని నీకు అసలే తెలియని నిజాన్ని తెలుసుకునే

టట్టు చేయటానికి ఈ డ్రగ్గు పనికిరాదు. అదే సాధ్యమైతే ఈపాటికి సృష్టిరహస్యాలన్నీ నేనే తెలుసుకుని ఉందును గద. (టెలిఫోన్ మోగుతుంది)

సీతా : ఒక్కక్షణం,..హలో, సీతాపతిని. ఆc, ఆc, ఏంరా, సూర్యం! ఆవిడ పుట్టినరోజు పండక్కి నేనుకూడా ఏమిట్రా?...ఏమిటి?...ఏదో సాకు చెప్పేయ్యలేవూ?... మరేం లేదుగాని, ఓల్డ్ఫ్రెండ్ ఒకతను చాలాకాలానికి కనిపించారూ, హస్కు కొడుతున్నాం,...అతన్నికూడానా? ఎందుకులేరా?...అతనిపేరు డాక్టర్ రామమూర్తి...ఆc ఆc...యూరప్‌లో ఒక ఏడాది ఉండివచ్చాడు ... ఏమిటీ?...రానంటాడేమో...నా తరఫున ప్రెజెంటా?... దానికేం భాగ్యం! నువే ఆవిడ కిష్టమైనదేదో కొనేసి నాకు బిల్లు పంపేద్దూ. నీ మొహం. ఇందులో పేరేమిట్రా? ఏమిటీ? నువ్వొస్తావా? బజారుకెళ్ళి నాతరఫునకూడా ప్రెజెంటుకొని తెస్తావా? ఎంతలో వస్తావ్?...ఇప్పుడు నా గడియారంలో (చూసుకుని) అయిదూ ఇరవై అయింది... అయిదూ నలభైఅయిదుకల్లా వస్తావా?...రెడీగా ఉండకేం జేస్తానూ? శనిపడితే పదేళ్ళూ నువుపడితే పధ్నాలు గేళ్ళూనూ. చీరియో...(టెలిఫోన్ చప్పుడుతో పెట్టేస్తూ) డామ్‌ఫూల్.

రామ్మూ : ఎవర్రా అదీ?

సీతా : సూర్యనారాయణ అనీ, ఎంతో తెలివిగలవాడురా, ఒక్క ఆడదానిమూలంగా ఫూలయిపోతున్నాడు.

రామ్మూ : నిన్నెక్కడికో రమ్మన్నట్టుందే?

సీతా : ఆ కల్యాణి పుట్టినరోజు పండగట. నన్నుగూడా రమ్మంటాడు. వీడు మాకందరికీ, వొద్దుబాబూ అంటున్నా వినకుండా ఒకప్పుడు సోషలిజంమీద లెక్చరిచ్చినవాడు. తెలుసా? భాగ్యవంతుల ఇంట ప్రవేశం దొరికేసరికి సోషలిజం కాస్తా ఇగిరి చక్కాపోయింది. ఆ మాధవరావుగారింటి కుక్కకన్న హీనంగా ఆ ఇల్లు పట్టుకు వేళ్ళాడుతున్నాడు. ఆ కల్యాణి తనని పెళ్ళాడుతుందని వాడి ఆశ-కోతికళ్ళా అదీనూ. నన్నడిగితే వాళ్ళమ్మ నిజంగా అందగత్తె, ముఫ్పైఅయిదు పైచిల్ల వయస్సున్నా ఇప్పటికూడా ఆ దమయంతి అప్సరసలాగా ఉంటుందనుకో.

రామూ్మ : ఈ సూర్యనారాయణ ఎట్లాపోతే నీకెందుకురా? అతనికిలేని బాధ నీకెందుకూ?

సీతా : పనికొచ్చేవాడు నిష్కారణంగా నీ కళ్ళఎదట పాడైపోతుంటే నీకెట్లా ఉంటుందిరా? వీడికి ఫస్టుక్లాసైన సెంట్రల్ గవర్నమెంట్ జాబ్ వచ్చింది. వెళ్ళగూడదూ? అంతోటి జగదేకసుందరీ కళ్ళుతిప్పి...మమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళిపోతారా?...అని అడిగిందిటా, రానని రాసేశాడు. వాడి క్షేమం కోరిన నాబోటివాళ్ళ కెట్లా ఉంటుందీ?

రామూ్మ: చూడు సీతాపతీ, ఇతనికీ సంపర్కం చెడగొడదాం?

సీతా : అంతకంటె కావాలిసిందేమిటీ ? కాని ఎట్లా చెడగొడదాం ?

రామూ్మ : (గొంతు తగ్గించి) నేను చెప్పిన డ్రగ్గు ఒక డోసు నా జేబులోనే వుంది.

సీతా : (నిర్ఘాంతపోయి) వాడికిద్దామంటావా? (ధైర్యంగా) అవు నెందుకివ్వకూడదూ ?

రామ్మూ : అయితే అతను వచ్చేలోపుగా కాఫీ ఏర్పాటు చెయ్యి, మరి.

సీతా : కొంపంతీసి వాడికేం అపకారం జరగదుకద ?

రామ్మూ : ఇదే అపకారం. అతను ఇవాళ ఆ కళ్యాణితో తన మనసులో వున్న నిజం చెప్పేస్తాడు.

సీతా : వాడి కామె మీద నిజంగా ప్రేమే వుంటే?

రామ్మూ : ఉంటే దానికి నువ్వు అభ్యంతరం చెప్ప బోతున్నావా ?

సీతా : లేదనుకో. (తెగింపుగా) సరే కానీ. ఇదేమిటో తేల్చేద్దాం. మా ఆవిడతో మూడుగ్లాసులు కాఫీ చెయ్య మని చెప్పొస్తానుండు.

రామ్మూ : ఇదుగో ఈ పొట్లంకూడా తీసుకుపో. కాఫీ దగ్గి రుండి చేయించి గుర్తుగా ఒక కప్పులో నువే దాన్ని కలిపి తీసుకురా. అతను వచ్చాక నీచేత్తో నువే కప్పులందించు. తెలిసిందా ?

సీతా : (భయంగా) పొరపాటున కప్పులు తారుమారైతే ?

రామ్మూ : మరేం కొంప మునగదులే. అది విషంకాదు.

—:o:—

# రెండవ రంగం

[మాధవరావుగారి ఇల్లు. సాయంకాలం ఆరుగంటలు. జనం సందడిగా ఉన్నారు. దూరంగా గ్రామొఫోన్ పాట వినిపిస్తోంది. దమయంతీ, కల్యాణీ మూలగదిలో ఏకాంతంగా చిన్న గొంతుకలతో మాట్లాడుకుంటూంటారు].

కల్యాణి : అమ్మా, ప్రెజెంట్లన్నీ జాగర్తగా, గుర్తుగా, ఉంచుతున్నావా ?

దమయంతి : ఆ, ఆ. ఇంకా రావలసినవాళ్లు—ముఖ్యమైనవాళ్లెవరన్నా ఉన్నారా ?

కల్యా : అందరూ వచ్చినట్టేలే. అన్నట్టు సూర్యం ఒకడు రాలేదు. వస్తాళ్ళే...అన్నట్టు, చూడమ్మా, రాత్రి భోజనాలకు చాలామందిని ఉంచకు. పది పన్నెండుమంది కన్న వద్దు.

దమ : అట్లాగేలేమ్మా.

కల్యా : చూడమ్మా. ఇవాళ సూర్యం పెళ్ళివిషయం అడుగుతాడేమో. ఏం చెప్పమంటావ్ ?

దమ : నువ్వేం తొందరపడకు. ఆలోచించుకుంటానను. మీ నాన్నగార్నీ, పెదబాబుగార్నీ, పబ్లిక్ ప్రాసిక్యూటర్ గార్నీ సలహా అడగాలని చెప్పు.

కల్యా : సరేలే. నే పోతున్నా. పెదబాబుగారు నీకోసమే కాబోలు కేకపెడుతున్నట్టుంది.

దమ : (విసుగ్గా) ఆయనొకడూ...ఎన్నిచోట్ల ఉంటాను—ఒక్క మనిషిని. (గొంతెత్తి) వచ్చె, వచ్చే. (కూతురితో అమ్మాయ్, నువ్విక్కడే వుండు, నే నిప్పుడే వస్తా.

(దమయంతి వెళ్ళినాక కల్యాణి ఏదో కూనిరాగం పాడుతూ వుంటుంది)

ప్రభా : (చిన్నగొంతుతో) హలో మిస్ కల్యాణీ !

కల్యా : హలో. ప్రభాకరరావుగారూ !

ప్రభా : (పాడుతూ) హాపీ బర్త్‌డే టుయూ...ఎవరూ లేరల్లే వుందే ?

కల్యా : (నవ్వుతూ) నే నున్నానుగా !

ప్రభా : అంటే, నావుద్దేశం. ఉండకూడ్లేనివాళ్ళెవరూ లేరు గదా అని.

కల్యా : వాళ్లెవరో నాకు తెలీదే.

ప్రభా : నువ్వూ నేనూ తప్ప మరెవ్వరూ అక్కర్లేదు.

కల్యా : అంత రహస్యమేమిటబ్బా ?

ప్రభా : ఇదుగో ప్రెజెంట్.

కల్యా : థాంక్స్...చెయ్యి వదలండి, ప్లీజ్.

ప్రభా : అంటే నాకు పాణిగ్రహణం ఆశ లేదన్నమాటేనా ?

కల్యా : ఇవాళేకదా నాకు పందొమ్మిది వెళ్ళాయి. ఇంకా రెండేళ్ళదాకా పెళ్ళాడే ఉద్దేశం నాకులేదు.

ప్రభా : రెండేళ్ళకి నాకేపాటి ఛాన్సుంటుంది. నూటిలో ఒక వంతు చాన్సున్నా కనిపెట్టుకుని వుంటాను. కల్యాణీ, నే నెంతమంది ఆడవాళ్ళనో ఎరుగుదును. కాని నువ్వు నన్ను ఆకర్షించినట్టు మరెవరూ ఆకర్షించలేదు. కారణం చెప్పలేను.

కల్యా : (మళ్ళా కొంటెతనంలో పడి) దానికి కారణం నే ననాకారిదాన్ని కావటమే అయి ఉంటుంది.

ప్రభా : (తీవ్రంగా) బ్యూటీ ఎవడికాక్కావాలి బ్యూటీ? సోల్ నాకు సోల్ కావాలి. నన్ను అర్థంచేసుకునే హృదయం కావాలి, నేను గౌరవించగల పర్సనాలిటీ కావాలి. కల్యాణీ, నాకు నువే కావాలి.

కల్యా : ఎందుకు నన్నిట్లా వేళాకోళంచేస్తారు? మీరు చెప్పే వేవీ నాలో లేవు. నేను అవకాశం దొరికినప్పుడల్లా ఫ్రూట్ సెలాడ్ తినే ఒక సామాన్యపు పిల్లను.

ప్రభా . (ఆవేశంతో) కాదు, కల్యాణీ, నువే నా ఫ్రూట్ సెలాడ్. నా వెనిలా ఐస్‌క్రీమ్. నా కోవా బర్ఫీ. (సంబాళించుకుంటూ) ఓహ్...నిన్ను చూస్తున్నకొద్దీ నాకు మత్తెక్కుతోంది, పిచ్చెత్తుతోంది. ఎవరన్నా త్వరగా వస్తే బాగుణ్ను. లేకపోతే నిన్నేంచేసేస్తానో నాకు తెలీకుండావుంది.

కల్యా : (తాపీగా) ఏం ఫరవాలేదు. అదుగో, మా అమ్మ వస్తోంది.

ప్రభా : (బతికిబయటపడ్డవాడల్లే) థాంక్స్. దమయంతీదేవి గారూ...మీరు సమయానికి వచ్చి నన్ను కాపాడారు. వస్తా, శలవు, గుడ్‌నైట్, గుడ్‌బై.

దమ : వీడేమిటే అంటాడూ?

కల్యా : వాడి మొహం, నా మొహం.

దమ : సూర్యం వచ్చాడు.

కల్యా : (ఆత్రంగా) ఎప్పుడు?

దమ : ఇప్పుడే. వెంట సీతాపతి గాక ఇంకెవరో తెచ్చాడు. వాళ్ళలో ఎవరు భోజనానికుంటారో నువే చూసుకో— తరవాత నన్నడక.

కల్యా : సరేలే, నే వెళుతున్నా...ఇదుగో, ఈ ప్రెజెంట్ ప్రభాకర్రావుది. గుర్తుగా ఉంచు.

[హాలులో]

సూర్యనా : నమస్కారమండీ, బాబుగారూ నమస్కారం, మాధవరావుగారూ. నమస్కారమండీ, దమ—దమయంతి గారు ఇంతలోనే ఎటో వెళ్ళిపోయారల్లే ఉందే? ఆవిడ లేకపోతే సభకు కళేలేదు. అందరిలోనూ ఉండే పరమాత్మ స్వరూపానికి ఒక్క నమస్కారం.

మాధవ : రావోయ్, సూర్యం. ఒహో, సీతాపతిగావా?—

సీతా : ఇతను నా బాల్యస్నేహితుడు, డాక్టర్ రామ్మూర్తి. నేనూ సూర్యం కలిసి బలవంతాన పట్టుకొచ్చాం.

మాధవ : వెల్‌కమ్. వెల్‌కమ్. కూచోండి. వీరు గంగాధరం గారు. రిటైర్డ్ ఐ. సి. యస్. నాకు తండ్రిలాంటివారు. నేను పైకిరావటానికి అడుగడుగునా సహాయపడ్డారు.

రామ్మూ : నమస్కారమండీ.

గంగా : ఇట్లా కూచో, బాబూ. నువ్వెవరి అబ్బాయివి?

రామ్మూ : మా నాయనగారిని మీరెరిగుండరు. కాని ససెక్స్‌లో మీ పాత స్నేహితుడు కూపర్ విలియమ్స్‌ను చూశాను.

గంగా : (సంతోషంతో) గుడ్ోల్డ్ కూపీ. ఇంకా బతికున్నాడా? మేం స్నేహితులమని నీకెలా తెలిసిందోయ్?

రామ్మూ : ఆయనే చెప్పారు. మిమ్మల్ని ఆయన గాంగ్‌స్టర్ అని పిలుస్తారుట కాదూ ?

గంగా : (గట్టిగా నవ్వుతూ) హూహ్హోహ్హో...డాట్ ది ఫెలో. అదికూడా చెప్పాడూ? (సంబాళించుకుంటూ) అది కాదురా, మాధవా! మొదటిసారి మేం కలకత్తాలో మీటయినప్పుడు నాపేరు ఉచ్చరించలేకపోయాడు. గంగాధరం అన్నమాట నోరుతిరగక గాంగ్‌స్టర్ అని పేరు పెట్టేశాడు. నైస్‌ఫెలో, వెరీ నైస్‌ఫెలో. వాడి తమ్ముడు జీమీ విలియమ్స్ బాయిలర్లు చేసేవాడు.

రామ్మూ : నేనాయన్ను చూడలేదు.

గంగా : అయితే నువ్వు అక్కణ్ణుంచి ఎప్పుడొచ్చావూ?

రామ్మూ : ఏదీ? వారమయింది. అక్కడ సంవత్సరంపైగా ఉన్నాను.

గంగా : గుడ్, గుడ్.

సూర్యం : అదుగో కల్యాణి, కల్యాణంకోసం ఎదురుచూసే కల్యాణి.

కల్యా: ఏమి టివాళ సూర్యం కొత్త ఉత్సాహంలో ఉన్నాడు?

సూర్యం : కాఫీ తాగాను, కాఫీ.

కల్యా : కాఫీయే తాగావా? ఇంకేమైనా తాగావా?

సూర్యం : ఇంకేమైనా తాగేది మీనాన్న.

మాధవ : (మండిపడి) ఏమిటీ నాన్సెన్స్?

సూర్యం : మీరు కొంచెం తగ్గండి. మిమ్మల్నెవరూ అనటంలేదు.

కల్యా : నువ్వు హాస్యంగా మాట్లాడుతున్నా ననుకుంటున్నావు కాబోలు, చాలించిక.

సూర్యం : అది కాదు, మీనాన్న తాగుతాడంటే మాధవ రావుగా రాగ్రహిస్తారేమటి?

కల్యా : నీకుమతిపోయిందా? ఆయన మానాన్న కాదూ?

సూర్యం : (బిగ్గరగా నవ్వి) వాట్ నాన్సెన్స్. మీనాన్నా ఐ. సి యస్. కళ్ళున్నకబోది ఎవడైనా ఆ విషయం తెలుసుకోవచ్చు, నీ అందచందాలన్నీ ఆయనవికాదా? ఆ మూర్తి ప్రపంచంలో ఇంకెవరికుంటుంది? నీ యిష్టం వచ్చిన వాళ్ళనడుగు.

గంగా : తప్పకుండా తాగొచ్చాడు, మాధవా. వెంటనే పోలీసులకు టెలిఫోన్ చెయ్యి. నెక్ ది ఫెలో ఔట్.

సూర్యం : ఐసియస్‌గారూ, తొందరపడకండి. నేను మిమ్మల్ని ఎంతమాత్రం తప్పుపట్టటంలేదు. మీ పొజిషన్‌లో నేనుంటే నేనూ ఆపనే చేస్తాను. అసాధారణమైన అందగత్తె. ఇప్పటికీ ఆమె అందానికి నేనూ ముగ్ధుణ్ణవుతూంటాను. ఆవిణ్ణి చూడటానికే నేనీ ఇంటికి వస్తూంటాను. ఏదీ దమయంతీదేవిగారు. వ్యభిచారిణీ పతివ్రత. సంఘానికి శిరోరత్నం, వృద్ధులకుసయితం నవసంజీవి.

సీతా : సూర్యం, ఏమి టీపేలాపన.

మాధవ : పోలీసులే తేలుస్తారు. ఇప్పుడే టెలిఫోన్ చేస్తాను.

రామ్మా : తొందరపడకండి. అతననేమాటలకు అతను

ప్రస్తుతం జవాబుదారుకాడు. పోలీసుస్టేషనుకు తీసుకు పోయినా ఈ మాటలే చెబుతాడు. పేపర్లకెక్కినా ఎక్క వచ్చు అతననే మాటలు అబద్ధాలేగనక మీరు తొందర పడనవసరంలేదు. ఒకవేళ నిజమయితే — ఆమాటలు బయటికి పొక్కకుండా ఉండటం ఎంతైనా అవసరం.

సూర్యా : నేను చెప్పింది వాళ్ళందరికీ తెలిసిందే, డాక్టరు గారూ. ఎందుకు ఉడుక్కుంటున్నారో నాకర్థంకావటం లేదు. నేను పరాయివాణ్ణా ? పెళ్ళిచేసుకోమని ఎప్పుడడుగుతానా అని కల్యాణి కనిపెట్టుకుకూర్చోలేదా ? నాకు కోపం తెప్పించారంటే అడగనే అడగను. కల్యాణి ఆ లోఫర్ ప్రభాకర్‌ని చేసుకోవలసిందే.

కల్యా : షటప్, ఇడియట్. ప్రభాకర్ నన్ను పెళ్ళిచేసుకుంటాననటమూ, నేను సరేననటమూ కూడా అయిపోయింది.

సూర్యా : (బిగ్గరగా నవ్వుతూ) అందుకేనా అతను ముఖం మటమటలాడించుకుంటూ వెళ్ళిపోతూ నాకు ఎదురయిందీ ? నేను ఇడియట్‌ను కాను, నువే ఇడియట్‌వు. ఎవడూ నమ్మని అబద్ధాలు చెప్పే ఇడియట్‌వు. మళ్ళీ మాట్లాడితే మీరంతా ఇడియట్లే. మీ డబ్బునుచూసి లోకమంతా గౌరవిస్తున్నదనుకుంటారు. మిమ్మల్ని లోకం ఫూల్ చేస్తున్నది. జీవితం మిమ్మల్ని పెంటపోగుమీది కిడ్చేస్తోంది. ఆ పెంటపోగు దుర్గంధం ఇక్కడ ఘాటుగా కొట్టటానికదే కారణం నేను మీమీద నిజమనే డీడీటీ చల్లుతున్నాను. దానితో మీరు క్రిములైతే చచ్చిపోండి.

క్రిములతో బాధపడుతుంటే వాటిని దులిపేసుకుని వెంట పోగుమీాదినుంచి ఇవతలికి రండి.

మాధ: (చిన్నగొంతుతో) బాబుగారూ, ఇతన్ని ఏంచేద్దాం?

గం: (గొంతు సవరించుకుంటూ, అనుమానంగా) పోలీసులకి రింగప్ చేయటం చాలా మంచిది.

సూర్య: ఆల్ రైట్...నేనే రింగప్ చేస్తా.

రామ్మూ: ఆ కెటిల్‌లోది కాఫీయేనా? నన్ను అనుమతిస్తే ఒక చుక్క కాఫీ తీసుకుంటాను.

గం: బై ఆల్ మీాన్స్. మై బోయ్. నాకూ్కడా ఒక గ్లాసందియ్యి—ఇఫ్ యు డోంట్ మైండ్.

మాధ: అమ్మాయ్, మీా అమ్మ ఏంచేస్తోంది?

కల్యా: (మాట్లాడటానికి ఇష్టంలేనిదానల్లే) లోపల ఏదో సర్దుతోంది నాన్నా.

సూర్య: (దూరంగా) హలో, హలో, పోలీసా...

రామ్మూ: ఇదుగోనండీ కాఫీ, మీారుకూడా తీసుకుంటారా మాధవరావుగారూ.

మాధ: థాంక్స్. (నిరుత్సాహంగా)

గం: (కాఫీతాగి) హా—వేరీ ఫైన్ కాఫీ, మై డియర్ ఫెలో!

మాధ: ఇందాక తాగిన కాఫీ ఇంతరుచిగా లేదే.

సూర్య: (తిరిగివచ్చి) డన్, పోలీసులు వస్తున్నారు.

గం: (ఆశ్చర్యంగా) పోలీసులా? ఎందుకూ?

సూర్య: మీారేగా పిలవమన్నారూ?

గం: (అయోమయంగా) అవును, నేనే పిలవమన్నాను. కాని ఎందుకూ హ్హా, హ్హా. హ్హా?

సూర్య : మీరు కల్యాణికి రియల్ ఫాదర్ అన్నానని.

గం : హాహ్హా. కాపిటల్, కాపిటల్ కల్యాణి నాకూతురే, నాకు తెలీదా ?

మాధ : అయితే కొంప మునిగిపోయిందేమిటంటాను. నేను అసూయపడలేదే. మీరు దమయంతిని లవ్ చేస్తే నేను కాదన్నానా ?

దమ : ఏమిటండీ దమయంతంటున్నారు ?

మాధ : నీ పేరు దమయంతి కాదా ? ఎందుకట్టా ఉలుక్కుంటావు ? నిన్ను బాబుగారు లవ్ చెయ్యాలా ? బుద్ధిగలవాడెవడైనా లవ్ చేస్తాడు. అయితే బాబుగారిదగ్గిర బుద్దే గాక అధికారం వుంది. డబ్బుంది. అవి అందరికీ వుండవు.

సీతా : (చిన్నగొంతుతో) ఏమిట్రా, రామ్మూర్తీ, ఇదీ ? ఇంత ఘోరకలి నే నెక్కడా చూడలేదు.

రామ్మూ : (అదే గొంతుతో) వాళ్ళిద్దరికీకూడా మతం ఇచ్చాను...నేను ముందే చెప్పానుకానా ?

సీతా : మనం సూర్యాన్ని పట్టుకుని పోలీసులు వచ్చేలోపుగా జారుకుందామా ?

రామ్మూ : అతన్ని బయలుదేరతియ్యి మరి.

సీతా : సూర్యం. ఒకమాటిట్లా రా.

సూర్య : ఏమిటి ?

సీతా : రామ్మూర్తికి తొందరపనుందిట, మనం పోదామా?

సూర్య : ష్యూర్, ష్యూర్. హలో, ఐసియస్ గారూ, పోలీసుల్ని కలుసుకునేటందుకు నాకవకాశంలేదు. వాళ్ళకి నా కాంప్లిమెంట్స్ అందజేయండి.

గం : హౌ్వాట్ పిటీ...టాటా, మై డియర్ ఫెలో.
సూర్య : టాటా. (ముగ్గురూ పోతారు)
దమ : (చిన్నగొంతుతో) వీళ్ళనుచూస్తే నాకేదో భయంగా వుందే, అమ్మాయ్. వీళ్ళేంచేస్తున్నారేం? ఆ ముసలాయన తాగలేదుగద? తాగితే ఆయన ఇదే ధోరణి.
కల్యా : నీకేమన్నా మతిపోయిందా ఏమిటి? ఇక్కడ తాగేందుకు మంచినీళ్ళూ, కాఫీ తప్ప ఇంకేమీ లేవు.
దమ : నేను రాగానే మీనాన్న అట్లా పేలుతున్నారేం?
కల్యా : నన్నడక్కు, నాకంతా అయోమయంగా వుంది. సూర్యం ఇట్లా అయిపోతాడని నేను కలలోకూడా అనుకోలేదు. అతనికేం వచ్చింది?
దమ : ఆ కెటిల్‌లో కాఫీ వుంటే నువు కాస్త తాగి నాకు కాస్త ఇయ్యి తల్లీ.
గం : దమయంతీ, నాకు సూర్యాన్ని చూస్తే అసూయ.
దమ : దేనికండీ?
గం : వాడు నీమీద కన్నువేశాడు.
మాధ : నా భార్య మూడు తరాలవాళ్ళని ఆకర్షించింది. ఆకర్షణంటే అట్లావుండాలి.
దమ : మీరు కాస్త నోరుమూస్తారా?
మాధ : ఎందుకు మూయాలి. నేను ముయ్యను. ఉన్నమాట అనుకోవటానికి భయమేం?
కల్యా : అమ్మా, కాఫీ.
దమ : తల పగిలిపోతోంది, తేవే. (కాల్‌బెల్ మోగుతుంది) ఎవరో వచ్చినట్లున్నారు. చూసిరావే.

గం : చూడు, మాధవా! నేను సార్థకజీవిని. నాకు కావలసిన అన్ని సుఖాలూ డబ్బుతో కొనుక్కున్నాను. ఊరికే ఏదీ పుచ్చుకోలేదు. కలెక్టరుగా పనిచేసినప్పుడుకూడా బుకాయించి లంచాలు పుచ్చుకుని ఎరగను నాకు లంచాలిచ్చిన వాళ్ళందరికీ లాభం చూపించాను. ఏమంటావ్?

మాధ : ఓఎస్, నేనూ అంతే. నేను మీదగ్గిర వట్టినే ఏ ఉపకారమూ పొందలేదు—ఎవరది?

దమ : పోలీసిన్స్పెక్టర్‌గారు.

గం : హౌ డు యు డూ, మై బోయ్.

పో. అధి : వెరీ గుడ్ ఈవెనింగ్. ఎందుకు టెలిఫోన్‌చేశారు?

మాధ : ఇవాళ మా అమ్మాయి పుట్టినరోజు. ఇరవైనాలుగో పుట్టినరోజు. అందుకని...అమ్మాయ్, ఆయనకొంచెం కాఫీ వుందా?

కల్యా : కెటిల్‌లో ఉందమ్మా. దమ : తెచ్చియ్యి తల్లి.

పో. అధి : ఇందుకేనా నన్ను పిలిచారు?

మాధ : చెప్పాలంటే చాలా గ్రంథం వుంది. అసలు తప్పు సూర్యంది. అడక్కుండా పెట్టకుండా, మా కల్యాణి ఐ సి యస్‌గారికి పుట్టిందన్నాడు. ఏం పుడితే? అందరూ ఎవరో ఒకరికి పుట్టవలిసిందేగా?

గం : యూ ఆర్ రైట్ మై బోయ్.

పో. అధి : త్రీనాట్ ఫోర్, ఇక్కడెక్కడైనా సీసాలున్నాయేమో చూడూ?

దమ : ఏమీలేవు మేం చచ్చినా అబద్ధంచెప్పం. మేం తాగిందల్లా ఈ కాఫీయే. పుచ్చుకోండి, మీరూ పుచ్చుకోండి.

పో. అధి : థాంక్స్ (టెలిఫోన్ మోగుతుంది)

కల్యా : (టెలిఫోన్‌లో మాట్లాడుతూ) హాలో ... అవును మాట్లాడేది కల్యాణి...నువ్వేనా, సూర్యం!...ఆఁ, అడగటం మరిచిపొయ్యావా? ఏమనీ?...పెళ్ళా?...మనమా? దేనికీ...నా డబ్బుకోసమా? ఆ సంగతి నాకు తెలుసు. అవునవును. తెలుసు. తరవాత మాట్లాడుకుందామా? వాళ్ళనుకూడా అడిగి కనుక్కుంటాను...చీరియో.

గం : ఏమంటాడు, సూర్యం?

కల్యా : నన్ను పెళ్ళి చేసుకుంటానని అడగటం మరిచాట్ట. మనమందరం చేరి అతన్ని గందరగోళం చేశాంట.

మాధ : అబద్ధం. వాట్టిపుణ్యానికి తనే గందరగోళం అయినాడు.

కల్యా : నే నెవరికూతుర్నయినా తనకు ఒకటేట.

పో. అధి : ఈ అమ్మాయి వాళ్ళ నాయనగారి కూతురు కాదా?

మాధ : వాళ్ళ నాయ నెవరన్నది ప్రశ్న.

పో. అధి : చిత్రంగా వుంది.

కల్యా : అతను నా అందం చూసి పెళ్ళాడటం లేదుట. నన్ను డబ్బుకోసం పెళ్ళాడతాట్ట.

మాధ : నీచుడు. దోపిడిగాడు. ఉత్తినే డబ్బు రావాలనే రకం. నే నటువంటి నీచాని కెన్నడూ పాల్పడలేదు.

కల్యా : ఊరుకో నవ్విపోతారు. నువ్వు నీ భార్యని కుదువ బెట్టావు. సూర్యం తనను తానే కుదువబెట్టుకుంటున్నాడు. నీకన్న యోగ్యుడే లే.

గం : అయితే ఈపెళ్ళి నీ కిష్టమేనన్నమాట.

కల్యా : ఏనాటినుండో ఇష్టం. నాకు తెలీని విషయాలేవీ సూర్యం టెలిఫోన్‌లో చెప్పలేదు.

దమ : నే నీ పెళ్ళికి ఒప్పను.

పో. అధి : అమ్మా మీ అభ్యంతరం తెలుసుకోవచ్చా?

దమ : సూర్యానికి నామీద ప్రేమఉంది. అతను నాకల్లుడుగా అక్కర్లేదు.

మాధ : మా అందరి బతుకులూ మొదటినుంచీ నువే పాడు చేశావ్. అడుగడుగునా నువే పానకంలో పుడకల్లే అడ్డు తగులుతున్నావ్.

దమ : ఇది మరీ బాగుంది. నేను లేకపోతే మీ జీవితానికి పానకం ఉండేదే—పానకం !

గం : మాధవా, నీఅంత కృతఘ్నుణ్ణి నేనెక్కడా చూడలేదు. దమయంతి కిష్టంలేకపోతే ఈ సంబంధం జరగదంతే.

కల్యా : ఇదేమిటీ ?...సూర్యం నాకోసం తెచ్చిన ప్రెజెంట్ ...నేను సూర్యాన్ని తప్పక పెళ్ళాడితీరుతాను.

దమ : (గొంతెత్తి) ఎక్కడికే ?

కల్యా : (దూరంనుంచి) సూర్యందగ్గిరకి.

పో.అధి : ఇక్కడ ఉన్న కాసేపూ చాలా ఎంజాయ్‌చేశాను. శలవు పుచ్చుకుంటాను.

గంగా : వెరిగుడ్ మైబోయ్. గుడ్‌నైట్.

పో.అధి: గుడ్‌నైట్. ఏయ్, త్రీనాట్‌ఫోర్.

పోలీస్ : సార్. ఎక్కడా మందు కనబడలేదు సార్.

పో.అధి: సరే. పోదాం పద.

# మూడవ రంగం

[సీతాపతి ఇంట్లో— మర్నాడు ఉదయం. సీతాపతీ, డాక్టర్ రామ్మూర్తీ...]

రామ్మూ : నే చెప్పలేదురా. అది భయంకరమైన డ్రగ్గు.

సీతా : మరీ అంత పచ్చిఘోరకలి నే నెన్నడూ ఎరగను. మైక్రోస్కోప్‌తో తాగే నీటిని చూసినట్టే.

రామ్మూ : మన నాగరికత యావత్తూ కళ్ళను డీఓడరైజ్ చేసి వాసనలేకుండా చూసుకోవటమే. అయితే నాగరికతకు ఈ డ్రగ్గును మించిన శత్రువులేదు. వాళ్ళబాధ చూడలేక కెటిల్‌నిండా డ్రిగ్గు కలిపేశాను.

సీతా : అంతపనీ చేశావని నా కప్పుడే అనుమానం తగిలింది సుమా ... ఈ దెబ్బతో సూర్యం ఆ కల్యాణిని వొది లేస్తాడంటావా ?

రామ్మూ : నిన్న అతని వైఖరిచూస్తే నీ కేమనిపించింది?

సీతా : ఆ వైఖరి నిలబడి ఉంటుందా అని.

రామ్మూ : నీకాభయం అక్కర్లేదు. అంతకుపూర్వం జరిగిన విషయాలైనా మరచి పోతాడుగాని నిన్నరాత్రి జరిగినదేదీ మరిచిపో లేడు.

నౌకరు : సార్...

సీతా : ఎవరూ ?

నౌకరు : డాక్టర్ రామ్మూర్తిగారున్నారా, సార్ ?

సీతా : ఉన్నారు, లోపలికి రా.

రామ్మూ : ఏమోయ్ ?

నౌకరు: నిన్నసాయంకాలం మీకీ ఉత్తరం వచ్చిందండీ. రాత్రి మీరింటికి రాలేదు. మా అయ్యగారు మీకీ ఉత్తరం ఇవ్వమన్నారు.

రామమ్మ: ఓహో...డాక్టర్ వైకుంఠరావు నవుకరువా? ఇచ్చెయ్యి ఉత్తరం...నేను నిన్న టర్పిన్ అని చెప్పానే, అతని దగ్గిర్నుంచిరా. ఎన్ని ఊళ్ళు తిరిగి వచ్చిందో. (ఉత్తరం చించి చదువుతూంటాడు)

సూర్యం: (బయటనుంచి) సీతాపతీ!

సీతా: రారా. ఓహో...కల్యాణికూడా వచ్చిందే. రండి, రండి, కూచోండి. ఏమిటింత పొద్దున్నే ఇద్దరూ కలిసి ఇట్లా వచ్చారు?

సూర్యం: కల్యాణి రాత్రే నాగదికి వచ్చేసింది. మేమిద్దరం పెళ్ళాడ నిశ్చయించుకున్నాం.

సీతా: కంగ్రాచులేషన్స్. ఇంత త్వరలో ఈ శుభవార్త వింటాననుకోలేదు.

కల్యా: మానాన్న ఒప్పుకున్నాడు, పెదబాబుగారుకూడా ఒప్పుకున్నారు. కాని యీపెళ్ళికి మా అమ్మ ఒప్పుకోలేదు. అందుకని నేను ఇల్లువదిలేసి వచ్చేశాను.

సీతా: నిన్నరాత్రి పెళ్ళిప్రస్తావనెప్పుడొచ్చిందీ?

సూర్యం: మిమ్మల్ని వొదిలాక కల్యాణికి టెలిఫోన్‌చేశాను. పెళ్ళాడతానని చెప్పాను.

కల్యా: సూర్యం నన్ను ముఖ్యంగా డబ్బుకోసం పెళ్ళాడుతున్నాడు. డబ్బుకోసం ఎందరో ఎన్నో పాడుపనులు చేస్తున్నారు జనం వీధుల్లో ముష్టెత్తుకుంటున్నారుకారా?

నాకు సూర్యాన్ని చూస్తే అందుకే జాలి. నాకు బుద్ధి తెలిసినప్పట్నించీ డబ్బుంటూనేఉంది. గనక, అది లేక పోవటమంటే ఏమిటో తెలీదు. అందుకని అది లేని వాళ్ళంటే మరీ జాలి...ఇక నాసంగతి అడగనవసరంలేదు. నేను మూడేళ్ళుగా సూర్యాన్నితప్ప మరొకర్ని నాభర్తగా ఆలోచించనేలేదు.

సీతా : అయితే పెళ్ళెప్పుడు?

సూర్యం : ఇవాళే రిజిస్ట్రారుకు అప్లికేషన్ పడేస్తే పదిహేను రోజులవతల ఎప్పుడైనా పెళ్ళిచేసుకోవచ్చు.

సీతా : భేష్.

కల్యా : రిజిస్ట్రారాఫీసుకు వెళ్ళి మళ్ళీ వస్తాం.

సీతా : మంచిది. (ఇద్దరూ పోయాక) ఏంరా, రామూర్తీ. ప్రేమకింతకంటె ఘోరమైన పారడీ చూశావా?

రామూర్తి : సంభాషణ అంతా విన్నాను...అబ్బా, నేనొకటి చెప్పనా?

సీతా : ఏమిటది?

రామూర్తి : ప్రేమ. నిజం, సత్యం, యదార్థం మొదలైన వాటినిగురించి మనకేవేవో విశ్వాసాలున్నాయి. వాటి లోపలికి దూరి పరీక్షించే అవకాశం మన కెప్పుడోగాని రాదు అటువంటి అవకాశం వచ్చినప్పుడు తాత్కాలి కంగా కంగారుపడతాం. కాని మళ్ళీ మనకు పొరలు కప్పేస్తాయి. భౌతికవాదులను తిడతాం. మనం విచిత్ర మైన మనుషులం. పట్టపగలు మేలుకునివుండి కలలుకంటాం. నిద్రలో నిజం మనని వేటాడుతుంది.

సీతా : నీ వేదాంతం నాకేమీ నచ్చలేదు.

రామ్మూ : నీకు నచ్చదు. నేనూ ఈ ఉత్తరం చూసేదాకా తప్పదారినే వున్నాను. నిజం నేననుకున్నంత భయంకరమైనది కాదు. ఈ కల్యాణి చూడు. నిజం తెలుసుకున్నాక ఆ మనిషి చెడ్డది కాలేదు. నన్నడిగితే మంచిదయింది, వాళ్ళిద్దరిమధ్యా వుండే ప్రేమ నీకు నచ్చలేదు. అది వాళ్ళ తప్పుకాదు. వాళ్ళిద్దరి భౌతికస్థితిని బట్టి అంతకన్న వున్నతమైన ప్రేమ సాధ్యంకాదు. మనకు శాంతి తెప్పిస్తున్నది యథార్థంకాదు సీతాపతీ, జీవితం. ఈ ఉత్తరంలో ఏముందో తెలుసునా ? మేం ఇంగ్లండ్‌లో ఒక కుటుంబానికి డ్రగ్గిచ్చాంమటినే...వాళ్ళప్పుడు వెనకటికన్నా సుఖంగా ఉన్నారుట. ఎంతవరకూ నిజమో తెలీదుగాని ఈ డ్రగ్గును కొంతమంది రాజకీయవేత్తల మీద ప్రయోగించానని రాస్తున్నాడితను.

సీతా : నీ డ్రగ్గులో నాకు విశ్వాసం పోతోంది.

రామ్మూ : ఏమట్లా ?

సీతా : ఏమో? చెబుతా విను. నీ డ్రగ్గు సాధించిన దేమిటి? ఇంగ్లండులో సుఖంగా వుండే దంపతులకిచ్చారు. వాళ్ళు కాస్సేపు కీచులాడుకున్నారు. తరవాత మళ్ళా సుఖంగా ఉన్నారు. నిన్న సాయంకాలం సూర్యానికి నీ డ్రగ్గిమ్మన టంలో నా ఉద్దేశం, వాడేమైనా మారి, ఆ డబ్బువ్యా మోహంనుంచి బయటపడి ప్రయోజకు డవుతాడేమోనని. అదేమీ జరగలేదు. వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకుంటారు. నీ

ద్రగ్గు యదార్థం చెబుతుందేమోగాని జీవితాన్ని మార్చదు. జీవితంగురించి శుష్కజ్ఞానం ఇస్తుంది. కలలు పాడుచేస్తుంది.

రామ్మూ : అంతవరకైనా మేలేకద.

సీతా : ఏమిటి మేలు? ప్రకృతి మనిషికి కలలుకనేశక్తిని వృథాగా ఇవ్వలేదు. కలలు కనగలవాడే ఎప్పటికైనా వాటిని వాస్తవం చెయ్యటానికి కృషి చెయ్యగలడు. నీ ద్రగ్గెందుకు చెప్పు.

రామ్మూ : (ఆలోచిస్తూ) ఊఁ...అంతేనంటావా?

—:o:—

# పరాజిత వ్యక్తి

## మొదటి రంగం

[సాంబయ్యగారి ఇల్లు డ్రాయింగ్ రూం. శాస్త్రీ, శర్మా, రావూ, స్వామీ, సాంబయ్యగారికోసం ఎదురుచూస్తూ తమలో తాము మాట్లాడుకుంటున్నారు.]

శాస్త్రి: నా కొక్కటే అనుమానం. ఇలాటివి సాంబయ్యగారు సహించరు. ఆయన నిరాడంబరుడు.

శర్మ: దానికేమీ సందేహంలేదు. నా ఆఫీస్ రూంకైనా ఆయన ఫోటో ఒక్కటి సంపాదించగలిగానూ?

రావు: అదంతా నిజమే. కాని ఈ ప్రయత్నం మనది. కాదనేటందుకు ఆయన కేమీ అధికారంలేదు. వచ్చే 14 గురు సాంబయ్యగారి వ్యాపారజీవితం 24 ఏళ్లు పూర్తిచేసి 25 వ ఏడు ప్రవేశిస్తుంది.

స్వామి: రెండువందల మూ ధనంతో సాంబయ్యగారు శివా అండ్ కంపెనీ పెట్టారు. దాన్ని రిజిస్టరు చేయించటానికి సాంబయ్యగారూ నేనూ వెళ్ళాం. రిజిస్ట్రేషన్ అనంతరం మే మందరం మా అయిదురూపాయల అద్దెగల కొట్టులో కూచున్నాం. ఆనాడు సాంబయ్యగారన్నమాటలు అక్షరాలా రుజువయినై. చిన్న మర్రివిత్తు ఆనాడు నాటాం. మమ్మల్ని చూసీ, మేము నాటిన విత్తును చూసీ ఎంత మంది నవ్వుకున్నారో, ఎందరు మమ్మల్ని చూసి జాలి పడ్డారో నాకైతే తెలీదు కాని, అది మహావృక్షమై పెరి

గింది విస్తరించింది; శాఖలు వేసింది; ఊడలు దించింది! ఆ రెండువందల పెట్టుబడిలో నుంచి పది హేను లక్షలు పుట్టుకొచ్చాయి! ఆ ఒక్క సంస్థలోనుంచి పన్నెండు సంస్థలు పుట్టుకొచ్చాయి! ఈ మహావృక్షంకింద పన్నెండు వందల ప్రాణాలు తలదాచుకున్నాయి! నిజంగా మహాను భావుడు, రాజ్యాలు ఏలదగిన మేధావి!

శాస్త్రి: నన్నడిగితే ఆయనలో విశేషం అదికాదు. ఆయన కున్న తెలివితేటలకు మరొకరైతే కోట్లు గడించేవారు. ఇవాళ కోటీశ్వరులైనవారిలో ఒకడు కూడా సాంబయ్య గారి కంటె సమర్థుడని నే ననుకోను. కాని ఆయనకు అన్యాయం పడదు. ఆయన అక్రమాలు సహించడు. ఆయన లాభంకోరి మనం ఏమైనా యుక్తులు చెప్పినా, "మనకెందుకు, శాస్త్రీ, ఇదంతా మనం వెంటబెట్టు కొచ్చామా? వెంటబెట్టుకు పోతామా? మనకు బయటి నుంచి ప్రతిబంధకాలేగాని చిన్న మెత్తుసహాయం రాదు. కానీ! ఎవరెంత పీక్కు తింటారో తిననీ! ఒకర్ని మోసం చేసి మనం ఒకరూపాయి తింటే మనకే అసంతృప్తి!" అంటాడు.

శ: అదిసరే. ఇన్ని ఆఫీసులు చూస్తున్నాం. ఇన్ని ఫాక్టరీలు చూస్తున్నాం; యజమానుల మీద ఏదో ఒక కోపంలేని ఉద్యోగులూ, పనివాళ్ళూ ఎక్కడన్నా ఉన్నారా? మన ఫాక్టరీలలో ఎక్కడన్నా ఒక యూనియన్ గాని, ఆందోళన గాని, అసంతృప్తిగాని ఉందా?

రా: అటువంటి ప్రయత్నాలు చేసినవాళ్ళంతా వెళ్ళే పోయారుగా. సాంబయ్యగారిది ఒకే సిద్ధాంతం: "నాలో నమ్మకం ఉంటే, నేను పైకి వస్తానని మీకు తోస్తే నన్ను నమ్ముకుని ఉండండీ! నాతో పాటు పైకిరండీ! నాకన్న ఎక్కువ ఇచ్చేవాళ్ళు మీకు దొరికితే మహారాజుగా వెళ్ళండీ! ఈభాగ్యానికి హాజస్లూ, సమ్మె బెదిరింపులూ దేనికి? నామూలంగా నలుగురు బతుకుతున్నారుగదా అని నేను సంతోషించటమేమిటీ? నేనేమో మిమ్మల్నందర్నీ బందిఖానాలో పెట్టి మీరక్తం పిండి తాగేస్తున్నానని మీరనుకోవటమేమిటి?"

వి: (దూరంనుంచి చప్పట్లు చరుస్తూ) హుర్రే! హుర్రే!

స్వా: అబ్బాయిగారా? దయచేయండి.

వి: అంతకంటె నేను చేయగలిగింది ఏమీ లేదు కూడానూ. మీరంతా నాన్నగారికోసం కనిపెట్టుకున్నట్టుందే?

శాస్త్రి: వారు తలంటుకుంటున్నారట. వస్తారు.

వి: ఇంతకీ ఏమిటి విశేషం?

స్వా: నాన్నగారి వ్యాపారాలకు రజతోత్సవం చేద్దామని.

వి: (నవ్వుతూ) అహోహోహో! హాహాహా! మీరింకా పెడత్రోవనే ఉన్నారు. నాన్నగారు వెండిని విసర్జించి చాలా కాలమయింది. ఆయన కిది బంగారుయుగం. మా అన్నపూర్ణ రత్నయుగంలో ఉంది. ఆవిడకి రత్నాలు పొదగని బంగారం మట్టితోసమానం! ఇంతకీ నాన్నగారు వ్యాపారం మొదలెట్టి ఇరవై అయిదేళ్ళయిందా ఏం?

స్వా : ఇరవైఅయిదు ఇంకా వెళ్ళలేదూ! ఇరవైనాలుగు వెళతాయి.

వి : మరేం? నాకూ అంతే! రజతోత్సవం తప్పక చెయ్యండి. నేను రజతోత్సవం చేసుకుంటానంటే నాన్నగారెలాగూ ఒప్పరు. పనిలో పని, నేను కూడా కొత్త నూటూ అదీ కుట్టిచ్చేస్తాను. నన్ను బంగారంతో—కనీసం వెండితో—కాటావేసి అది నా కిప్పించేయండి. నా కది మూలధనంగా ఉంటుంది. నేనూ ఓ పాతిక పరిశ్రమలు స్థాపించి తండ్రిని మించిన కొడుకనిపించుకుంటాను.

శర్మ : అబ్బాయిగారూ, నాన్నగారి వ్యాపారాలు మీకు వేళాకోళంగా ఉంటాయని నాకు తెలుసు గాని ఒక్క విషయం అడుగుతాను చెబుతారూ?

వి : అడగండి, శర్మగారూ. అడగటం మీవంతూ చెపటం నావంతూ!

శ : సరిగా మీవయసులోనే నాన్నగారు మొదటిసారి వ్యాపారంలోనికి అడుగు పెట్టారు. అప్పటి కాయనకు అనేక రకాల వ్యాపారాలలో పదేళ్ళ అనుభవం ఉంది. అప్పటికే ఆయనకు యంత్రాలు రిపేరుచెయ్యటం తెలుసు. వ్యాపారం ప్రారంభించేసరికి ఆయన మూలధనం రెండువందలు మాత్రమే. ఆయనతో పోలిస్తే మీరు ఎంత ఉన్నతస్థితిలో ఉన్నారు! రెండేళ్ళక్రితందాకా ఉన్నతవిద్య చదివారు. ఒకరికింద నౌకరీ చెయ్యలేరు. నిష్పూచీగా ఉన్నారు.

మీ చేతిఖర్చుకని ఎన్ని వేలు తీసుకున్నారో నాకు తెలీదు. ఫలితం? ఏమన్నా ఫలితం ఉందా అని అడుగుతున్నాను.

వి : ఫలితం లేదనటానికి లేదు, శర్మగారూ! మా నాన్న గారి లాగా నేను ఇనప యంత్రాలలో ప్రవీణత సంపాదించలేదు గాని భగవంతుడు మనకందరికీ ప్రసాదించిన బుర్ర అనే యంత్రం ఉందే దాన్ని నడిపించటంలో కొంచెం చాక చక్యం నాకూ ఉంది.

శ : మీకు తెలివితేటలు లేవని నేమంటామా, అబ్బాయి గారూ? మనుషులను కూడగట్టుకుని, పనిచేయించుకుని, పది మందీ బాగుపడేలాగ వ్యాపారం చెయ్యాలంటే దానికి కావలసిన తెలివితేటలూ, శక్తి సామర్థ్యాలూ వేరు. ఏమంటారు? నే నేమన్నా తప్పు చెప్పానా?

వి : నాన్నగారి కంపెనీలో నాకూ షేర్లున్నాయి, మరవకండి. నేనూ వ్యాపారస్థుణ్ణే. పోతే, మీరు చెప్పే శక్తిసామర్థ్యా లన్నీ పనివాళ్ళని మోసంచెయ్యటంలోనే గదా? నా పద్ధతులు నా కున్నాయి. మీ పద్ధతులు పనివాళ్ళమీద పారకపోయేసరికి నా పద్ధతులు పనికివస్తాయి.

శ : అబ్బాయిగారూ, పనివాళ్ళని వెంటేసుకు తిరిగి, వాళ్ళకి అడపా దడపా డబ్బు లిస్తుంటే వాళ్ళు మిమ్మల్ని గౌర విస్తారనుకుంటున్నారా? వాట్టిది. వాళ్ళ జాతిలక్షణా మీ రెరగరు. వాళ్ళను ఉంచే దూరంలో ఉంచకపోతే మననికూడా వాళ్ళస్థాయిలో పెట్టేస్తారు. వాళ్ళకు గౌరవించ టం తెలీదు; గౌరవాన్ని మనం వాళ్ళనుంచి బలవంతం గా నే పుచ్చుకోవాలి.

వి : మీా రెన్నడూ పనివాళ్ళతో కలిసి తిరిగినట్టు లేదే, వాళ్ళ రహస్యాలు మీాకెలా తెలిశాయబ్బా! (వెటకారంగా)

శ : నన్ను బొత్తిగా తీసేస్తున్నారు. నేనూ పాతికేళ్ళుగా పనివాళ్ళతో సంబంధం ఉన్నవాణ్ణి.

వి: (నవ్వుతూ) అహ్హాహ్హాహ్హా! శర్మగారూ, చల్లగాఅంటించటం మీాకు బాగా తెలుసు. పనివాళ్ళతో మీాకున్న అనుభవం నా వయసంత వుందంటారు! బాగానేఉంది గాని ఇప్పుడీ రజతోత్సవం దేనికి చెప్పండి.

శ : (ఉత్సాహంగా) అలా అడగండి చెబుతాను. రెండేళ్ళ నుండీ మన వ్యాపారం సన్నగిల్లుతూ వస్తున్నదిగద. మన దేమిటి, అన్ని వ్యాపారాలూ అంతంత మాత్రంగానే ఉన్నాయి. వెనకటిలాభాలూ, ఆదాయాలూ మళ్ళీ వుంటాయీా అనిపిస్తున్నది. ఒకప్పుడు మన సంస్థలో పనిచేసే వాళ్ళు గర్వపడేవాళ్ళు. ప్రపంచమంతా బీడేసిపోయినా మన పరిశ్రమలకూ, వ్యాపారానికీ చలనం వుండదని వాళ్లు నమ్మేవాళ్ళు. ఆ భ్రమ కాస్తా పోతున్నది. మన కిప్పుడు పోటీకూడా సంప్రాప్తమయినది. రెండు మూడు వ్యాపారాలలో మనని తలదన్నేవాళ్ళు వచ్చారు. మన నుంచి పనివాళ్ళు మనని విడిచి వాళ్ళదగ్గిరికి వెళ్ళారు. మన ప్రతిష్ట కొంచెం చాటుకోవటం ఈ తరుణంలో ఎంతైనా అవసరం. అందుకే రజతోత్సవం!

వి : ఆ పతకాన్నే రెండోవైపు తిప్పి చూడండి. పనివాళ్ళకి మనమీాద ఉన్న గురి తగ్గటానికి కారణం మన లాభాలు తగ్గటమా? కాదూ, రెండేళ్ళనుంచి మనం వాళ్ళకి బోనసు

లివ్వలేకపోవటం, ఇంక్రిమెంట్లు ఇవ్వలేకపోవటం, జీతాల మీద ధారాళంగా ఎడ్వాన్సు లివ్వలేకపోవటం! ... ఈ ఉత్సవం మోతగా జరగాలంటే ఏపాటి ఖర్చవుతుం దంటారు?

శ : వీలయినంతవరకు పదివేలు దాటకుండా చూస్తాం.

వి : నే నయితే ఆ డబ్బు పనివాళ్ళ కిచ్చేస్తాను. పనివాళ్ళను మోసం చెయ్యటంలో మీ పద్ధతులు వేరు. నా పద్ధతులు వేరు శర్మగారూ... నేను వెళ్ళి నాన్నగార్ని పంపిస్తా!

శా : అదుగో! మాటలోనే వచ్చేశారు. బాబుగారికినూరేళ్ళు!

సాంబయ్య: (వస్తూ) కూచోండి. కూచోండి...ఏం, శాస్త్రీ! ఏం ఇలా వచ్చారు?

శా : మరేంలేదు. మనరజతోత్సవంగురించి మాట్లాడదామని.

సాం: వొద్దనుకున్నాంగదా! మనం తలవొంచవలిసిన రోజులు, శాస్త్రీ! తలఎత్తామంటే ఎటునుంచి ఏ దెబ్బ పడేదీ చెప్పలేం,

శా : మన నిరుత్సాహం వదలటానికైనా ఇది చెయ్యవలిసిందే నండీ. ఎస్టిమేట్ వేశాం, చూడండి.

సాం : ఏదీ? (కాగితం తీసుకుని) పద్దెనిమిదివేలే! గవర్నర్ కు పార్టీ యూ?

శా: అవును, బాబుగారూ. ఆరోజుకు గవర్నరుగారు ఎలాగూ వస్తున్నారు. మన రజతోత్సవానికి గవర్నరుగారు ప్రారంభోత్సవం చేసే ఏర్పాట్లు స్వామిగారు చూస్తామంటున్నారు.

సాం : (కొంచెం మెత్తబడుతూ) గవర్నరువస్తే కాస్త అడావుడిగానే ఉంటుంది. పత్రికల్లోకూడాఫోటోలు, అవీ-ఆఁ?

శ : దానికేగదుటండీ.

సాం : ఏమోనబ్బా! నాకేమో, ఎందుకిదంతా అనిపిస్తున్నది, మరి మీరంతా జరిగించాలంటే జరపాలిసిందేగాని.

రా : మీకు పబ్లిసిటీ గిట్టదని మాకు తెలుసు. కాని మన సంస్థలకు ఈ తరుణంలో పబ్లిసిటీ ఎంతైనా అవసరం. దీనివల్ల మనవాళ్ళలో కలిగే ఉత్సాహం ఆలోచించండి.

సాం : (అనుమానంగా) అదీ నిజమే...ఇంకేం, ఏదో ఒకటి చేద్దాం. ఇంకా టైముందిగా?

స్వా : ఎంత టైముందండీ? పదిరోజులేగా? చెయ్యవలిసిన ప్రయత్నం చాలా ఉంది.

సాం:మన క్షేమంకోరే స్నేహితులతో ఆలోచించి సాయంత్రం ఏదో ఒకటి నిర్ణయింతాం.

శా : అయితే మేం శెలవుపుచ్చుకుంటాం.

సాం : మంచిది, శాస్త్రీ. వెళ్ళిరండి...శర్మా, ఒక్కమాట... నేను వచ్చేముందు అబ్బాయి ఏదో అంటున్నాడే?

శ : మన రజతోత్సవం గురించే.

సాం : తనయితే పనివాళ్ళకి డబ్బిస్తా నంటాడేమిటి?

శ : రజతోత్సవం వద్దంటారు అబ్బాయిగారు.

సాం : (సాలోచనగా) హుఁ! ... వీణ్ణి ఎవరో పాడు చేస్తున్నారు, శర్మా! వీ డెప్పుడూ ఈ సమ్మెదార్లతో, సోషలిస్టులు వాళ్ళతో తిరిగినట్టే ఉండడు; వాళ్ళ ప్రచారం చదివినట్టే ఉండడు; వీడికీ ధోరణి ఎట్లా అబ్బిందో తెలీకుండా ఉంది. ఒక పనివాడితండ్రి పక్షవాతంతో పడి

పోయాట్ట, వీడు డాక్టర్ నాయుడుగార్ని పట్టుకెళ్ళి వైద్యం చేయించి ఇంజెక్షన్లకూవాటికీ ఖర్చంతా పెట్టుకున్నాడు.

శర్మ : అదంతా అబ్బాయిగారి ధర్మబుద్ధి. అంతకంటె ఇం కేమీా లేదు.

సాం : ధర్మం మనమూ చేస్తాం. ఒకచేత్తో ధర్మం చెయ్య దలిచినవాడు రెండో చేత్తో సంపాదించాలిగద. నేను సంపాదించటమూ, వాడు ధర్మం చేయ్యటమూ అయితే, చిల్లికడవ నింపినట్టు ఎంతకాలం సాగుతుందీ ? రేపింకోపని వాడికి ఎదురుదెబ్బ తగిలిందనుకో. వాడు నాదగ్గిరికి రాడే! ధర్మదాత అబ్బాయి ఉన్నాడుగా ? అక్కడికే పోతాడూ ? ఫలితమేమిటి ? నా పనివాళ్ళకు నేను శత్రు వునూ, వాడు మిత్రుడూనూ! చూస్తూ ఉండు, శర్మా. ఇదేదో దొంగ ఎత్తు! అమ్మాయి అన్నపూర్ణ ఉందా, దానికీ ఏకారాలేమీాలేవు. అది అన్నివిషయాలలోనూ నా కూతు రనిపించుకుంటుంది. వీడి వాలకమే మరీ వింతగా ఉంది! ఎందుకైనా మంచిది, పనివాళ్ళకి మన ప్రబుద్ధు డేమైనా నూరిపోస్తున్నాడేమో కాస్త కనిపెట్టి ఉండు వెళ్ళిరా! మళ్ళా ఎవరితోనూ ఈ మాట అనకు. కడుపు చించుకుంటే కాళ్ళమీాద పడుతుంది.

శ : వస్తానండి. సాయంకాలం రజతోత్సవం ఏర్పాటు చూద్దాం.

సాం : మంచిది, శర్మా.

—:o:—

# రెండవరంగం

[ఒకనెల తరువాత—సాంబయ్యగారి ఇంట్లో వినాయక రావు పడకగది. రాత్రి చాలా పొద్దుపోయింది వినాయక రావు చదువుకుంటుండగా చిన్నగా తలుపుమీద వేలు మీటిన చప్పుడు.]

వినాయకరావు : ఎవరది ? (కొంచెం ఆగి) నేను నిద్రపోతు న్నాను. (మళ్ళా చప్పుడు) న్యూసెన్స్! ఉఫ్. (లేచివెళ్ళి తలుపు తీస్తాడు) ఏం, ఈవేళప్పుడు నన్ను డిస్టర్బ్ చేస్తున్నావ్ ?

అన్నపూర్ణ : అర్జంటు విషయం, అన్నయ్యా. తలుపుముయ్యి

వి : (తలుపు మూసివచ్చి) ఏం కొంపమునిగింది ?

అ : కొంపే మునిగింది. ఇంతకుమునుపే భాస్కర్ వచ్చి నాన్నతో మాట్లాడి వెళ్ళాడు.

వి : ఎవడా భాస్కర్ ? నువ్వు నీ స్నేహితులకు పెట్టుకునే ముద్దుపేర్లు నేను గుర్తించి యాడవలేను.

అ : ప్రతి అక్షరానికీ పీఠిక చెబితే తప్ప నీతో మాట్లాడటం సాధ్యంకాదు. అందుకే నిన్ను పలకరించటం చికాకు.

వి : అయితే పలకరించకు. వేంచెయ్యి. నిన్ను నేను బొట్టూ కాటికా పెట్టి పిలవలేను. పద పద !

అ : ఇకన్నుంచి పోతే నేరుగా బావికే !

వి : అంత సీరియస్సా ? అయితే నాకర్థమయ్యేట్టు చెప్పు. ఎవడీ భాస్కర్ ?

అ: భాస్కర్రావు. మీ ఇంజనీరు.

వి : ఏమంటాడు ఇంజనీరు భాస్కర్రావు.

అ : నన్ను పెళ్ళాడనని చెప్పేశాడు.

వి : పోనీ!...కొంపదీసి నిన్ను పెళ్లాడమని అడిగావా ఏమిటి?

అ : నువ్వట్లా మాట్లాడేట్టయితే నేను పోతాను.

వి : చూడు, అన్నం—

అ : నన్ను అన్నం, సున్నం అని పిలవొద్దని ఎన్నిసార్లు చెప్పాను ?

వి : నాకు నిద్దరొస్తోంది, దయచెయ్యి.

అ : (పశ్చాత్తాపంగా) లెంపలేసుకున్నాగా !

వి : నువ్వు వాణ్ణెవణ్ణో అడిగితివిగా పెళ్ళిచేసుకోమనీ ? వాడి పే రేమిటీ ?

అ : తిరుమలరావేనా ? అది అప్పుడే! పోయింది. పైగా నే నడిగాననటం ఇన్సల్ట్ !

వి : తిరుమలరావు మాట కాదు—తిరుమల్రావును పెళ్ళిచేసుకోమని అడిగావని నాకు నువ్వు చెబుతుంటేనే తెలిసింది!

అ : నే నడగలేదు బాబో అంటుంటేనే.

వి : అడ్డురాకు! వాడి పేరు నోట్లో ఆడుతోంది!

అ : నన్నెందు కిలా కాల్చుకు తింటున్నావ్ ?

వి : పోనీ ! ఇంతకూ నువ్వు మా ఇంజనీర్‌ను పెళ్లాడమని అడిగావ్వా ! అతను చేసుకోనన్నాడూ ! ఇప్పుడేం కొంప మునిగిందీ ?

అ : చేసుకోనని ఇప్పు డంటున్నాడు. అదివరకల్లా చేసుకుంటాననే అన్నాడు, వినపడింరా ? నే నడగలేదు

వి : అందులో పెద్దతేడా ఏమిటి? రెండురోజులు లాగితే ఇంకోడు దొరుకుతాడు, వాణ్ణి అడుగుదువుగాని! ఇప్పుడొచ్చిన ప్రమాద మేమిటి అంట!

అ : నీబుర్ర పనిచెయ్యటంలేదు, ప్రమాదమే వచ్చింది.

వి : (నిర్ఘాంతపోయి) కొంపతీసి – (ఆగుతాడు) మీ ఇద్దరికీ పెళ్ళి అయే తీరాలన్నమాట! అంతేనా?

అ : (చిన్నగొంతుతో) అవును.

వి : ఇది సీరియస్సే! కొంచెం ఆలోచించనీ. (కాస్త ఆగి) ఇదంతా నాన్నకి తెలుసా?

అ : తెలీదు. అమ్మకూడా తెలీదు. కాని అమ్మ త్వరలోనే కనుక్కుంటుంది.



వి : అతను నాన్నతో మాట్లాడా డన్నాడా?

అ : అది ఈ విషయం కాదు. ఫ్యాక్టరీ గొడవ.

వి : దానికీ దీనికీ సంబంధం ఉందా?

అ : లేకపోతే ఇదంతా రాదుగా?

వి : ఏమిటి సంబంధం? విపులంగా–నాకర్థమయేట్టు చెప్పు.

అ : ఈమధ్య రజతోత్సవం చేశారు కదూ? దానికి ఇరవైవేలు ఖర్చయిందిటగా?

వి : ఇంకా ఎక్కువే అయిందేమో కూడాను! అయితే?

అ : ఆ ఖర్చు భాస్కర్ కిష్టంలేదు.

వి : నాకూ యిష్టంలేదు.

అ : అదంతా పనివాళ్ళకి బోనస్ కింద ఎందు కివ్వలేదన్నాడు.

వి : నేనూ అన్నాను.

అ : నన్ను చెప్పనీ. పైగా ఈ ఉత్సవం చేసిన పదిరోజుల్లో వందమందిని తీసేశారుటగా ?

వి : అవును. తీసేశారు.

అ : అదీ భాస్కర్ కిష్టంలేదు.

వి : నాకూ—సారీ! చెప్పు.

అ : అతను పనివాళ్ళందరిచేతా సంఘం పెట్టించాడు. తీసేసిన వాళ్ళందర్నీ పనిలోకి తీసుకోమనీ, లేకపోతే సమ్మెచేయిస్తానని నాన్నతో చెప్పటానికి వచ్చాడు. ఇద్దరూ ఘోరంగా పోట్లాడుకున్నారు నాన్నను అట్లా ఎవరూ కడిగెయ్యగా నేను చూడలేదు. నాన్నకూడా ఏమీ తగ్గలేదుగాని పైనుంచి వింటుంటే నాకు భాస్కర్ చెప్పేదే రైటుగా తోచింది. ఇరవైవేలు ఉట్టి పుణ్యాని కెందుకు తగలేసినట్టు? ఆమాట అడగటానికి భాస్కర్‌కు హక్కు లేదంటాడు, నాన్న !

వి : భాస్కర్ నిజంగా సమ్మె చేయిస్తాడంటావా ?

అ : దేవుడు చెప్పినా మానడు.

వి : నువ్వు చెప్పినా మానడా ?

అ : నేనా ?

వి : అవును నీ మీద ఏదో ప్రేమ ఉండి ఉండాలిగద.

అ : సమ్మెకోసం నన్ను వొదిలేస్తున్నాడే ?

వి : నీకు చాతనయితే ఈ సమ్మె ఆపటం మంచిది.

అ : నాన్నలాగే మాట్లాడుతున్నావు. ఎవరికి మంచిది ?

వి :నువ్వు భాస్కర్‌లాగా మాట్లాడటంలా? సమ్మె జరక్కుండా

ఉండటం మనకే కాదు, సమ్మెచేసేవాళ్ళకు మంచిది. అందరికన్నా నీకు మంచిది. తెలిసిందా?

అ: నేను భాస్కర్‌కు చెప్పేదంతా చెప్పి చూశాను. సమ్మె వాళ్ళ కెందుకు మంచిదంటావూ?

వి: సమ్మెవల్ల ఫలం ఉండదు గనక. అసలు రహస్యం చెబుతా విను. ఈ ఫ్యాక్టరీ ఇప్పుడున్న పరిస్థితిలో మూసెయ్యటం మనకులాభం. సమ్మెవంక పెట్టి ఫ్యాక్టరీ రెండు నెల్లు మూసేస్తే ఈలోపల పరిస్థితి కొంచెం చక్కబడవచ్చు.

అ: నా విషయం వొదిలేసి సమ్మెవిషయం చెబుతావేమిటి?

వి: నీ విషయం నన్నేం చెయ్యమన్నావు?

అ: పనిలోనుంచి తీసివేసిన వాళ్ళను పనిలోకి మళ్ళీ రప్పించు. ఆ పని జరిగితే నేను ఒడ్డున పడతాను.

వి: (అనుమానంతో) నిన్ను అడ్డంపెట్టుకుని భాస్కర్రావే నాటకం ఆడటంలేదుగద?

అ: ఛా ఛా!

వి: సరే నేను భాస్కర్రావుతో మాట్లాడతాలే.

అ: (నిరాశగా) నాన్నతో మాట్లాడవా?

వి: ఎవరితో మాట్లాడాలో నువునాకు చెప్పకు. నేను భాస్కర్రావుతో మాట్లాడతాను.

అ: నీయిష్టం! త్వరలో నన్నొక ఒడ్డున పడెయ్యి.

వి: (నవ్వుతూ) అహ్హాహ్హాహ్హా! నాన్న నిన్నుచూసి మహాగర్వ పడ్డందుకు మంచి ప్రాయశ్చిత్తం చేశావులే! వెళ్ళి పడుకో!

# మూడవ రంగం

[రెండురోజుల అనంతరం, సాంబయ్యగారింటో
భోజనాలదగ్గిర]

సాం : కూచో, భాస్కర్రావ్. మా వినాయకరావూ నువ్వూ కలిసి మాట్లాడిన సంగతులన్నీ విన్నాను. నాదగ్గిర దాపరికాలులేవు. మీ నిర్ణయం నా కెంతమాత్రం నచ్చలేదు.

భా : నచ్చకపోతే ఆశ్చర్యంలేదు. వినాయకరావుగారు తనంతట తానే ఈ సూచన చేసినప్పుడు నే చెప్పనే చెప్పాను- ఇది పెట్టుబడిదార్లు ఆమోదించే నిర్ణయంకాదని.

సాం : ఆభాషే నాతో మాట్టాడకు! నే నెటువంటివాణ్ణో నువ్వెరగవా? నేను పెట్టుబడిదారుల్లాగే ప్రవర్తిస్తున్నానా?

భా : మీ ఇంటికి అతిథిగా వచ్చి మీతో ఘర్షణపడటం నా కిష్టంలేదు. ఈవిషయాలు వేరే మాట్లాడుకుందాం.

సాం : (గొంతు తగ్గించి సౌమ్యంగా) ఘర్షణలేకుండా ఏదో ఒక నిర్ణయానికి వద్దామనేగదా నిన్నీపూట భోజనానికి పిలిచింది? ఇంతకీ నే ననేదేమంటే, ఈఫ్యాక్టరీలో మనం మనుషుల్ని తీసేశామంటే పనిలేకనే తీసేశాం. ఇప్పటికైనా ఇది లాభసాటిగా నడుస్తుందని నాకు నమ్మకంలేదు, నాకు లాభంకూడా వద్దు. వచ్చేది మీ జీతాలకూ పై ఖర్చులకూ సరిపోతే చాలు. అదీ నమ్మకం లేకుండా వచ్చిందే!

భా : మీ రామాట అన్నారు గనకనే, మీరు చెప్పే ఖర్చులన్నీ లెక్కవేసి ఇచ్చినట్టయితే, అవి సబబుగా ఉన్నా

యని మాకు మీరు నచ్చజెప్పినట్లయితే, అవిపోగా మిగిలేదే పనివాళ్ళు పంచుకుంటారని నేను అబ్బాయిగారితో అన్నాను.

సాం: అంటే తీసివేసినవాళ్ళకోసం మిగిలినవాళ్ళు తమ జీతాలు తగ్గించుకుంటారన్నమాట! అంతేనా?

భా: ఆ విషయం ప్రస్తుతానికి ఎత్తకండి.

సాం: స్నేహపూర్వకంగా పనివాళ్ళ మంచిచెడ్డలు అడిగి తెలుసుకునే హక్కుకూడా నాకు లేదుటోయ్?

భా: అయితే చెబుతాను. ఫాక్టరీని మేమే నడిపితే ఎవరి జీతాలూ తరగవని మా నమ్మకం. ఒకవేళ తరిగితే ఎవరికీ అభ్యంతరం లేదు. మీరు నష్టపడి ఏ ఒక్కడికీ జీతం ఇవ్వాలని ఎవరూ ఎన్నడూ కోరలేదు. నేనిదివరకే మీతో మనవిచేసినట్టు పనివాళ్ళను తగ్గించటంలో కూడా అక్రమాలు జరిగాయి. మీశాస్త్రి శర్మ వగైరాలు పగకొద్దీ మంచిపనివాళ్ళను కొందర్ని తీసేయించారు. నిజంగా తీసెయ్యవలసినవాళ్లు కొందరు ఉండిపోయారు.

సాం: ఏది? మీ యూనియన్‌లో చేరనివాళ్ళు! అవునా?

భా: నా దృష్టిలో క్రమమైనదంతా మీ దృష్టికి అక్రమంగా కనిపిస్తుంది. మనం రాజీయత్నాలు చేస్తున్నాం గనక యూనియన్ వగైరా రాజకీయాల జోలికి పోవద్దు.

సాం: నన్ను అపార్థం చేసుకోకూ? నీతో రాజీ విషయాలు మాట్లాడే ముందు, నువ్వు పెత్తనంకోసం నా ఫాక్టరీకీ, పనివాళ్ళకీకూడా అపచారం చేస్తున్నావేమో తెలుకోవద్దా?

భా : ఈ విషయం నేను రుజువుచేసుకోలేను, నేనీ సమస్యవల్ల బావుకున్నది ఏమీలేదుగాని, నష్టపోయింది చాలా ఉంది.
అన్న : (వస్తూ) భాస్కరరావుగారు అప్పుడే వచ్చేశారే?
సాంబయ్యభార్య : (వస్తూ) ఏం, నాయనా! ఈమధ్య బొత్తిగా కనపడటమే లేదు. మా వినాయకుడితో కలిసి చదువుకునే రోజుల్లో రోజూ వచ్చేవాడివి. అమ్మగారు కులాసాగా ఉన్నారా? చెల్లెలూ పిల్లలూ కులాసా?
భా : అంతా కులాసాగానే ఉన్నారండీ?
అ : అన్నయ్య ఒకట నిమిషంలో వస్తున్నాడు. వడ్డించమన్నారా, నాన్నారూ ?
సాం : తొందరలేదు లేవమ్మా ! ఏమన్నావోయ్!
భా : మిగిలిన వివరాలన్నీ దేనికి ? మీరు ఫాక్టరీని నడపలేకుండా ఉన్నారు గనక మమ్మల్ని కొంతకాలం నడపనివ్వండి. మీకుగల సమస్యలన్నీ పోతాయి. మేం మనుషులను తీసేస్తామో, పెడతామో మా భాధ మేం పడతాం. మా యాజమాన్యాన సమ్మెలూ గిమ్మెలూ ఉండవు.
సాం: నేను ఫ్యాక్టరీ కట్టటమేం, మీ చేతిలో పెట్టటమేం? ఇది సబబేనా ?
భా : ఎందుకుకాదూ ? మేం ఫాక్టరీని ఎత్తుకుపోతామా? మీ ఎకౌంటెంట్లుంటారు, మీ కాషియర్లే ఉంటారు. నడిపే బాధ్యత మాది, మేనేజిమెంటు మాదీ! ఈ ఫ్యాక్టరీ మీద నష్టం వస్తోందని మీరు చెప్పేమాట, మేనేజిమెంటు మా కివ్వటానికి మీకు గల అభ్యంతరమూ పరస్పర విరుద్ధంగా ఉన్నాయి.

సాం : ఆ ఫాక్టరీ నా చేతికి తిరిగి ఏ స్వరూపంలో వస్తుందో?

వి : (వస్తూ) సారి, ఎవిరిబడీ ! ఏం భాస్కర్రావ్? భోజనాల కూర్చోబోతూ వ్యవహారాలు మాట్లాడుతున్నట్టు న్నారు. అందుకే వ్యాపారస్తులకు తిండి అరగదు. వ్యవ హారం ఏమన్నా దారికి వచ్చిందా?

భా : నాన్నగారు అసలు పరతుకే అభ్యంతరం చెబు తున్నారు. ఫ్యాక్టరీ మేనేజిమెంటు మాకివ్వమంటున్నారు?

సాం : అది ఎట్లా సాధ్యమని?

వి : పోనీ రాజీపడగూడదూ?

భా : ఏవిధంగా?

వి : నన్ను మీ కార్మికుల తరఫున మేనేజరుగా పెట్టుకోండి. నాకు జీతం అవసరంలేదులే !

సాం : నీకేం పిచ్చెట్రా? నిన్ను మేనేజరుగా వాళ్ళు ఆమో దిస్తారూ? పాము చుట్టం పడగ పగానా?

భా : పగగురించి మాట్లాడకండి. అన్యాయం. ఇందులో పగ ఎవరికీ లేదు. ఒకవేళ యూనియన్ వినాయకరావుగారి మేనేజిమెంటుకు ఒప్పుకుంటుందేమో చూస్తాను.

వి : బ్రేవో! బ్రేవో! చూశారా, ఎంత క్లిష్టసమస్య ఎంత తేలిగ్గా తేలిపోయిందో!...అమ్మా, వడ్డించమనూ.

—:o:—

# నాలుగవ రంగం

[ఒక నెల అనంతరం సాంబయ్య ఇంట్లో డ్రాయింగ్ రూం]

సాం : (కోపంగా) భాస్కర్‌ని పెళ్ళాడుతుంది! నా కొడుకు నా ఫ్యాక్టరీలు తీసుకుపోయి కూలాళ్ళకి వప్పగిస్తాడు! నా కూతురు కూలాళ్ళ నాయకుణ్ణి పెళ్ళాడుతుందీ. ఇట్లా ఉంది నా సంతానం! వాణ్ణి గురించి నే నెప్పుడూ ఆశ పెట్టుకోలేదు. ఏ సమర్థుడి కడుపున సమర్థుడు పుట్టాడు గనక? ఇదేమో నా పేరు నిలబెడుతుందనుకున్నాను!, ఇప్పుడిదొచ్చి భాస్కర్ని పెళ్ళాడుతుందట! భాస్కర్ని! సిగ్గులేక దానికి నువ్వు వొత్తాసి! బాగుంది! చాలా బాగుంది!

భా: ఇంత గొప్పపేరు తెచ్చుకున్నారు, ఇంత సమర్థులు-మీరు కూడా పామరుల్లాగా మాట్లాడతా రేమండీ?

సాం : అడక్క, అడక్క నా సమర్థతే అడిగావు! అన్నిటికీ సమర్థుడున్నాడుగా నీ సుపుత్రుడూ!

భా : (సాధింపుగా) నా సుపుత్రుడు మీలాగా మాట్లాడే లేదు. దాని కిష్టమైన వాణ్ణి చేసుకోనీ, మధ్య మన జోక్యం ఏమిటన్నాడు.

సాం : ఉద్ధరించాడు!...ఏమే అమ్మాయ్! ఇంతమంది కుర్రాళ్ళను చూస్తున్నావ్. నీకు భాస్కర్ కంటె యోగ్యుడు దొరకలా?

అ : భాస్కర్ కేం, నాన్నా?

సాం : ఆమాట అడగటానికి సిగ్గులేదుటే? నామీద కత్తికట్టి పనివాళ్ళచేత యూనియన్ పెట్టించింది వాడు కాదూ?

భార్య : ఏ మర్ధంలేని మాటలండీ ? మిమ్మల్ని కాళ్ళబేరానికి దింపి ఫ్యాక్టరీ పుచ్చుకున్నదీ అతనేగా ?

సాం : పుచ్చుకుంటారు, పుచ్చుకుంటారు ! నేను నడపలేని ఫ్యాక్టరీని ఈ వాజా, మన వాజా నడుపుతారు ! ఇవాళ బాలెన్స్‌షీట్ తెమ్మన్నాను. అందులో ఏం తభావతు కనిపించినా ఫ్యాక్టరీ లాగేసుకుంటాను. సమ్మెలూ చట్టుబండలూ అన్నారో మకేటలు విరగదన్నిస్తాను.

భార్య : మీ రన్నీ అలాగే అంటారు. ఫ్యాక్టరీ నిక్షేపంగా నడుస్తోందని అబ్బాయి అన్నాడు.

సాం : వాడన్నాడు ! నువు విన్నావు ! దొ-రి-కారు!

అ : భాస్కర్ కూడా అమాటే అన్నాడు నాన్నా.

సాం : తోడుదొంగలు ! ఎలక్కి పిల్లి సాక్ష్యంట!

అ : (ఉత్సాహంగా) అదుగో భాస్కర్!

భా : ఇదుగోనండీ బాలెన్స్ షీట్.

సాం : (గొణుగుతూ) జీతాలు, ఓవర్ హెడ్, రిపేర్లు... (విస్మయంగా) ఆశ్చర్యం ! ఆశ్చర్యం !

భా : ఇందులో ఆశ్చర్య మేముందండీ ? నా కేమీ ఆశ్చర్యం లేదు.

సాం : నేను-నా-నా అంచనాలన్నీ తలకిందులైనాయి. పెద్దవాణ్ణి ఒక టడుగుతాను చెప్పు, భాస్కర్రావ్ ? నా కీ ఫ్యాక్టరీ నడపటం చాతకాలేదా ?

భా : ఉన్నమాట అన్నందుకు క్షమించండి. మీరు ఫ్యాక్టరీలు కట్టారుగాని ఎన్నడూ నడపలేదు. నడిపిన సమర్థులు వేరే ఉన్నారు.

సాం : అవును, నేను పెట్టిన ఉద్యోగులు.

భా : కాదు, పనివాళ్ళలో కొందరు! అందరూ అని నే ననను కాని కొందరున్నారు, మీరు పెట్టిన ఉద్యోగులు, లాభాలు వాటంతటవే వస్తున్న కాలంలో తెగతిని, రోజులు గడ్డుబారేసరికి మంచి పనివాళ్ళతో తగాదా పెట్టుకున్నారు. ఇది మనఫ్యాక్టరీలోనే కాదు, సర్వత్రా జరుగుతున్నదే.

సాం : ఆశ్చర్యం !

భా : ఈసారి ఫ్యాక్టరీని నడపటంలో — కనీసం మనుషులను పట్టుకురావటంలో మన వినాయకరావు ప్రజ్ఞ చాలాఉంది.

సాం : నువు చెబుతున్నావు గనక నమ్ముతున్నాను. గాని నాకు మావాడి ప్రయోజకత్వంలో ఏమీ నమ్మకం లేదు. ప్రతి నెలా ఫ్యాక్టరీ ఈవిధంగా నడుస్తుందంటావా ?

భా : ఎందుకు నడవదండీ ? నిజంగా ఫ్యాక్టరీమీద అభిమానమే ఉంటే అవసరమైనప్పుడు అందరమూ త్యాగంచేస్తాం.

సాం : ఆ మాట బాగుందోయ్. అన్నట్టు మావాడేడీ ?

భా : మీటింగున్నది. ఫాక్టరీలోనే ఉన్నారు. నేనుకూడా వెంటనే వెళ్ళాలి. కానుంది. మీరుకూడా రండి.

సాం : (కొట్టినట్టు) నేనా! నే నెందుకులే!

భా : అలా అనకండి. మీరు వస్తే కార్మికులు సంతోషిస్తారు.

సాం : న న్నావూట నమ్మమన్నావా ?

భా : నా మాటనమ్మొద్దు, మీరు స్వయంగావచ్చి చూడండి.

సాం : నాకేమో బిడియంగా ఉందిసుమా !

భా : ఒకసారి వచ్చెయ్యండి. చలితీరిపోతుంది.

సాం : సరే పద !

## అయిదవ రంగం

[మీటింగు. కార్మికుల కరతాళధ్వనులు]

భాస్కర్ : సోదరులారా! (కరతాళధ్వనులు నిలిచిపోతాయి) ఇప్పు డెక్కడచూసినా యజమానుల కార్మికుల సామరస్యంగురించే మాట్లాడుతున్నారు. కుహకప్రియాలతో కార్మికులను వంచించటానికి యజమానులుకూడా ఈ మాటలను అనటం కద్దు. కాని అట్టివారికి బుద్ధి వచ్చేట్టుగా మన యజమాని శ్రీ సాంబయ్యగారు ఈ సామరస్యాన్ని అమలులోకి తెచ్చారు. మన యూనియన్‌ను ఆయన గుర్తించటమేగాక, ఫ్యాక్టరీనిర్వాహణ యూనియన్‌కు వదిలేశారు. మన నిర్వాహణఫలితం చూసి ఆయన మనని గొప్పగా అభినందించారు. ఇది మనకూ వారికీ కూడా గొప్పవిజయం. ఈవిజయాన్ని మనం బలపరుచుకోవటానికి ఇతోధికంగా కృషిచేసి దేశంలోని ఇతర కార్మికసోదరులకు మార్గదర్శకులంగా ఉంటూ ఇతర యజమానులకు గుణపాఠం నేర్పుదాం. (యజమాని కార్మిక సామరస్యం—"వర్ధిల్లాలి!" అని అరుపులు) ఈ మీటింగుకు సాంబయ్యగారు వచ్చి అధ్యక్షత వహించటం మన అదృష్టం. ఆయన రెండు ముక్కలు చెబుతారు. మనం సావధానంగా విందాం.

సాం : స్నేహితులారా! ఇప్పుడు మీ ఇంజనీరుగారు చెప్పిన మాటలు–ఆయన బాష–వింటుంటే నాకు ఒక్కటీ నిజంలా వినపడలేదు. లోపం నా చెవిది అయి ఉంటుంది నేను పరిస్థితుల ప్రోద్బలంవల్ల ఫ్యాక్టరీని మీకు వప్పగించానేగాని

మిమ్మల్ని గురించి నే నెన్నడూ ఆలోచించలేదు. ఇవాళే మొదటిసారి మిమ్మల్ని గురించి ఆదరభావంతో అనుకున్నాను. నేనుకూడా, నా అపజయాన్ని గుర్తించటం ఇష్టంలేక మీమీద హింసాకాండ జరిపి ఉండేవాణ్ణే. అదృష్టవశాత్తూ ఆ ప్రమాదం తప్పిపోయింది. నేను నా ఓటమి అంగీకరించాను. మీరు గెలిచారు. నేనుమిమ్మల్ని చూసి వాస్తవంగా గర్విస్తున్నాను. మీ నాయకుణ్ణిచూసి కూడా గర్విస్తున్నాను. మీరు నన్ను ఆశే అభినందించే ముందు మీకు ఒక్క విషయం చెప్పాలి. ఇవాళో రేపో ఇంజనీర్ భాస్కరరావు నా కుమార్తెను పెళ్ళి చేసుకునే అవకాశం లేకపోలేదు. అందుచేత ఇదంతా చివరికి ఏక కుటుంబ వ్యవహారం అయేలాగుంది!

(కార్మికుల హర్షధ్వానాలు)



# ఎదురింటివాడు

## మొదటిరంగం

[ నాగేశ్వరం ఇల్లు : ఉదయం. ]

కాంతయ్య : మొత్తానికి భలేపని చేశావులే, నాగేశ్వరం. ఇల్లు మరొకరికి పోనివ్వొద్దని నెల్లాళ్ళుగా చెబుతుంటెనిగదా, ఎలా చెయిజారిపోనిచ్చావురా ?

నాగేశ్వరం : నన్నేం చావమన్నావుట్రా, కాంతం! ఆయింటాయనేమో ఊళ్లో ఉండేవాడు కాడాయె. ఏ అమావాస్యకో, పౌర్ణమికో, వచ్చినప్పుడన్నా రెండు నిమిషాలు నిలిచి మాట్టాడాయె. ఆయనతో మాట్టాడాలంటే నడుస్తూ మాట్టాడాలిసిందేనా? నీకు మాత్రం తెలేదూ? అప్పటికీ, వారంరోజుల కిందట కనిపించినప్పుడు కూడా నాతో చెప్పకుండా ఇల్లెవరికీ ఇవ్వనని మాట యిచ్చాడు మరి. ఇంతలోనే ఇలాచేస్తాడని కలగన్నానా ?

కాం : పోనిస్తూ, ఎడ్వాన్సుదగ్గిర ఏదో పేచీ ఉండి ఉంటుంది. అది నువు సరిగా అడిగితెలుసుకోలేదు, ఇల్లుకాస్తాపోయింది యాభైరూపాయలకు దివ్యమైన యిల్లు! ఆఫీసుకుదగ్గిర, బజారుకుదగ్గిర. దక్షిణపుగాలి ధారాళంగా వస్తుంది. ఇంకో అయిదు పెట్టమన్నా పెట్టేవాణ్ణే చెప్పొద్దూ! ఎక్కడో మారుమూల అఘోరిస్తున్నాం.

నాగే : పోనీ ఆ అయిదురూపాయ లెక్కువిస్తానని నాతో మాట మాత్రం చెప్పావా ?

కాం: ఎట్లా చెప్పనూ? పారబోసేందుకు నాదగ్గిరమటుకు డబ్బుండేడిసిందీ? అంతగా తప్పనిసరయితే ఇచ్చేవాణ్ణనూ అని నీతో మాటవరసకన్నా. ఈ యిల్లు తప్పకుండా దొరుకుతుంది, ఒకరికొకరం ఎదురుగా పడి ఉంటాం; ఒకరింటికి ఒకరు రావాలంటే మైలున్నర రానక్కర్లేదుగదా అని ఎంతో ఆశపడ్డాం, ఏంలాభం?...ఎవరదీ?

నాగే: (గొంతెత్తి) మాధవరావుగారా, దయచెయ్యండి, దయచెయ్యండి. వెయ్యేళ్లు! మీమాటే అనుకుంటున్నాం.

మాధవరావు: (వస్తూ) కూచునే వ్యవధి లేదండీ. తిరుగుబండికి వెళ్ళిపోవాలి. కొత్తవారింటో ప్రవేశించిందీ, లేందీ చూసి పోదామని వచ్చా.

నాగే: సరేకానండి, నాతో చెప్పకుండా యిల్లెవరికి ఇవ్వనంటిరిగదా, మాటమాత్రం చెప్పకుండా ఇచ్చేశారే?

మాధ: అబ్బే, వీరు నెలరోజులేనండీ ఉంటారూ! అందుకని యిచ్చా. పెద్దమనిషి నన్ను వెతుక్కుంటూవచ్చి, వంద రూపాయిల నోటు వద్దంటున్నా చేతిలోపెట్టి, ఒక్క నెలపాటుంటానని చెబుతుంటే ఎలా కాదనేదీ?

కాంత: నెలకే వందా?

నాగే: వారికంత గండగత్తెర ఏ మొచ్చిందబ్బా?

మాధ: ఏమోనండీ. అదంతా మనకు తెలీదు. ఆయన నన్ను అద్దెంతని కూడా అడగలేదు — నమ్ముతారో నమ్మరో. ఇల్లు ఖాళీ అవుతున్నదని తెలిసిందట. ఖాళీ కాగానే ప్రవేశిస్తారు. ఆయన తొందరా, మంచితనమూ చూచి ఒప్పుకున్నా.

నాగే : అయన పేరేమిటన్నారూ ?

మాధ : ఏదో చిత్రమైన పేరండీ...ఆఁ! సార్వభౌమరావు!... అబ్బో అప్పుడే తొమ్మిదిన్నర అయిందే? నేను వెళ్ళాలి. శెలవిప్పిస్తారా?

నాగే : ఒక్కమాట వినిపొండి. ఇదిగో ఇతడు నా స్నేహితుడు. పేరు కాంతయ్య. ఇతనికి...

మాధ : (వెళ్ళిపోతూ) నేను మళ్ళీ ఎల్లుండి వస్తున్నా. సావకాశంగా మాట్లాడుకుందాం.

నాగే : వెళ్ళాడు...ఇదేవరస! నూరు రూపాయలనోటు చేత పెట్టే సరికి ఇల్లు కాస్తా ఇచ్చేసి కూచున్నాడు. ఈ సార్వభౌమరావు నెలరోజులుండి పోతాడంటావా ?

కాంత : నాకేం నమ్మకంలేదు. రాబోయేది వేసవి. చుట్టూ చల్లగా చెట్లూ, రాత్రిళ్ళు దక్షిణపు గాలీ మరిగాక ఆ యిల్లు చచ్చినా వదల్రు. నాకా యిల్లు దక్కే గీత లేదింతకూ...ఈ మాధవరావు డబ్బుకు బోల్తా పడతాడని మాటమాత్రం తెలిసుంటే ఆ నూరురూపాయల నోటు నేనే ఆయన మొహాన జండా ఊపినట్టు ఊపి ఉందునే.

నాగే : నీ యిల్లు పాడుగాను – యిల్లుమాట అట్లా ఉండనీ. ఈసార్వభౌమరావు విషయంకనుక్కోందే నాకునిద్రపట్టేట్లు లేదే. ఈయనెవరు ? ఏవూరు ? ఏ అర్జంటు పనిమీద ఈ ఊరొచ్చాడు ? నెల్లాళ్ళలో ఈయన చేసే పనేమిటి ?

కాంత : నీదంతా ఓ గోల. వాడెవడైతే మనకేం ? చాతయితే, ఆయనగారు నెలాఖరుకు కొంప ఖాళీచేస్తాడేమో, అది కాస్త కనిపెట్టుండు...రండి అక్కగారూ. నేనేలెండి.

సీతమ్మ : (వస్తూ) ఇంకెవరి గొంతో కూడా విని పిస్తేనూ—

కాం : ఆయన ఎదిరింటాయనలెండి.

సీత : (ఆశ్చర్యంగా) వచ్చాడా ? ఏమండీ బాగా పెద్దవాడే టగా ? ఆ సూటూ, టోపీ, హడావుడీ అంతా చూసి చిన్నవాడేమో అనుకున్నా.

నాగే : ఇక్కడికొచ్చినాయన మాధవరావు. ఎదటింటోకి అద్దెకొచ్చినాయన అనుకుంటున్నావు గామాలు.

సీత : మాధవరావా ?...కొత్తాయనేమో, ఎందుకొచ్చాడా అనుకున్నా.

నాగే : ఇంకా రాలేదుగా ? వచ్చినప్పుడడుగుదాంలే.

సీత: మీరడిగే దేమిటి? నేనే అడుగుతాను. మన పనిమనిషిని కాజేశారు, తెలుసా ?

నాగే : (ఆశ్చర్యంగా) ఎదటింటివాళ్ళే ?

సీత : ఆహా...ఇంకా వస్తుం దింకా వస్తుందని ఏడున్నరదాకా చూచి ఇంటెడు పనీ నేనే చేసుకున్నా. ఇంతకుముందు చూద్దునుగదా, వాళ్ళింటోనించి వస్తున్నదీ! ఏమిటే, ముండా అంటే, కాస్త ఇల్లు బాగుచేసి పొమ్మన్నారన్నది. నిలవదీసి అడిగితే నెలకు పదిరూపాయలిచ్చి పెట్టుకున్నారని ఒప్పుకుంది. పది రూపాయలు ! నాలుగు రూపాయలకు అడవా చాకిరీ చేసేదాని కెంత దశపట్టిందో ! నిన్న నేగా జీతం ఇచ్చేశానూ, ఈ పూట అక్కడ చేరిందీ!...అసలీ పనివాళ్ళ కేకోశానన్నా కృతజ్ఞతంటూ ఉందీ ?

నాగే : నువు చెప్పేది మరీ బాగుంది. పది రూపాయలు

వొదులుకుని అది నీ దగ్గిర నాలుగు రూపాయలకు పని చేస్తే కృతజ్ఞత ఉన్నట్టూ, లేకపోతే లేనట్టూనా ?

సీత : ఇట్లా మాట్లాడితేనే పనివాళ్లు నెత్తి నెక్కేది. దాని సంగతి పోనీండి–ఏదో గడ్డితిన్నది. ఆ పెద్దమనిషి కేం పొయ్యేకాలం ? ఊళ్లో ఇంతమంది పనివాళ్ళుంటే మన మనిషినే కాజెయ్యాలీ ?

కాంత : నాగేశ్వరం, ఈయ నెవరో తమాషా మనిషల్లే ఉన్నాడ్రా ! డబ్బుతో మనుష్యుల్ని కొనటంలో గట్టివాడే. మాధవరావును కొనేసి నా కిల్లులేకుండా చేశాడా, మీ పనిమనిషిని కొనేసి మీకు పనిమనిషి లేకుండాచేశాడు.ఆఁ?

నాగే : బాగా డబ్బున్నవాడల్లే ఉంది. కాని ఈ డబ్బుతో మన గుండెలమీద ఎందుకెక్కి కూచున్నాడని ?

సీత : ఎందుకా? నా దుంప తెంచటానికి !...ఏమండీ, వదినె గారు బొత్తిగా ఇటుకేసిరావటమే లేదే ?

కాంత : ఏదీ, మీరు రానిస్తేగా ? ఎదటిల్లు తీసుకుంటే దగ్గిరిగా ఉంటాంగదా అనుకున్నా. గద్ద తన్నుకుపోయినట్టు తన్నుకుపోయాడు మానవుడు !

సీత : అమ్మాయికి సమ్మంధాలేవన్నా చూస్తున్నారా ?

కాంత: అడక్కండి, అక్కగారూ. ఇక సంబంధాలు వెతకటం, చెయ్యటం పెట్టుకోలా. నాలుగు రూపాయల కవర్లుకొని ఇంటోపడేశా. పత్రికలో వధువు కావాలని కనిపించే ప్రకటనకల్లా జవాబు రాసిపడెయ్యమని రుక్మిణికీ, మా ఆవిడకూ చెప్పా. రోజూ ఉదయం పత్రిక చూడగానే మా కిదేపని అనుకోండీ...మా అమ్మాయి కూడా చెప్పే

సింది. అరనైలోపువాడు ఎన్నో పెళ్ళినాడైనా, ఏ కులం వాడైనా చేసుకుంటానన్నది.

సీత : (నవ్వుతూ) మీరెప్పుడూ చమత్కారంగానే మాట్లాడు తారు లెండి.

కాంత : (సీరియస్‌గా) చమత్కారంకాదు. నిజంగానే ! ఏమి టండీ లేకపోతే ? ప్రాణం విసికిపోతుంటేనూ !

సీత : నిజమేలెండి. మా పెద్దన్నయ్య పెద్దదాని కెట్లాగో ముడిపెట్టేశాడు. రెండోదానికి ఇరవైరెండేళ్ళు. ఇంతవరకు పెళ్ళి పెటాకులూ లేను. రాసిపెట్టివున్నప్పు డవుతుంది లెమ్మని నోరాయించి కూచున్నాడు.

కాంత : ఎవరైనా అంతకన్న చేసేదిలేదు లెండి.

సీత : మరి మీకు సమాధానాలు రాకటంలా ?

కాంత : రాకేం? ఒకట్రెటీ సరిపోకుండా ఉంది. కాకపోయినా మేం అడ్డమైన ప్రకటనలకూ వేస్తున్నాంలెండి. ఎందుకూ? ఇవాళ ఒక సంబంధానికి వేశాం. లక్ష రూపాయాల ఆస్తిగల కుర్రాట్ట. వ్యాపారంలో ప్రవేశించాట్ట. ఆధునిక పద్ధతులు తెలిసిన పిల్ల, అందగత్తె కావాలన్నారు. రాసి పడేశాం. నాకు తెలీదూ ? సమాధానం కూడా రాదు. కాని బేడా డబ్బులకు లోపించటం దేనికీ ?

సీత : అంతే లెండి...క్షణంలో కాఫీ తెస్తున్నా, చెప్పకుండా వెళ్ళిపొయ్యేరు? (పోతుంది).

కాంత : ఎందుకమ్మా, ఇంకాస్సేపట్లో భోంచెయ్యబోతుం టేనూ?

నాగే : ఫరవాలేదులేరా! (రామూరావు వస్తాడు) ఏంరా, రామూ! ఇంకా కాలేజీకి వెళ్లే యత్నం లేదా?

రామూ : నాన్నా, నాన్నా, ఒక్క అయిదురూపాయలుంటే ఇయ్యి నాన్నా.

నాగే : దేనికిరా?

రామూ : ఫొటోలు తీయించుకోటానికి.

నాగే : దేనికిరా?

రామూ : ఎవరికో పంపించాల్లే, నాన్నా.

నాగే : దేనికిరా?

రామూ : పనికొచ్చేవాళ్ళకి సినిమాల్లో వేషాలిస్తారుట, నాన్నా.

నాగే : (ఆశ్చర్యంగా) సినిమాల్లో వేషాలేస్తావుట్రా?

రామూ : చాలా డబ్బొస్తుంది, నాన్నా.

నాగే : ఎవరు చెప్పారు?

రామూ : సినిమా స్టార్లంతా లక్షలు సంపాదిస్తున్నారు, తెలుసా?

నాగే : అది కాదురా, వాజా! ఫొటోలు పంపిస్తే వేషమిస్తాము నీకో ఎవరన్నారూ?

రామూ : ఇవాళ పత్రికలో ఉంది,

నాగే : ఒరే, కాంతం. ఇంటికి పత్రిక తెప్పించటం ముప్పయింది.

కాంత : అది నే నొప్పుకోను. పత్రిక రానిరోజు మాకు చిన్నబోయినట్టుంటుంది.

నాగే : ఎవరి గొడవ వాళ్ళది... ఊఁ, ఫొటోలతో బాటు అయిదు రూపాయలు పంపుతావూ? అది కాస్తా వాళ్ళు దిగమింగి కూచుంటారు. ఓ పదిరూపాయలు పత్రికటన కింద తగలేసి నేనే ఈ పనిచేస్తే బాగుండునే, బోలెడంత డబ్బొస్తుందీ?

రామా : అయిదు రూపాయలూ ఫోటోలు తీయించుకోటానికే, నాన్నా! వాళ్ళకేమీ పంపించనక్కర్లా.

నాగే : ఉద్ధరించారు... రేపో యెల్లుండో చూద్దాంలే.

రామా : రే పిచ్చేది ఇప్పుడిస్తే ఏం పోయింది, నాన్నా?

నాగే : కాంతం! నీ సలహా ఏమిటి?

కాంత : మాట్లాడకుండా ఇచ్చెయ్యి! మనం పిల్లలకు మళ్ళా మాన్యాలూ ఇచ్చేది లేనేలేదు. వాళ్ళ అదృష్టం చూసుకోటానికీపాటైనా సహాయపడకపోతే ఎట్లా?

నాగే : వీడి మొహానికి సినిమాలో వెయ్యట మేమిట్రా ?

కాంత . అదే పొరబాటు. మన తరంవాళ్ళం ఒకళ్ళమూ అనుకోని పనులుచేసి యాడవలేదు. కాని ఈ తరంవాళ్ళు చేస్తున్నారు. సుదర్శనంగా రబ్బాయి, చూడూ, క్షణంలో గొప్ప కథకుడై కూచున్నాడు. వాణ్ణి ప్రోత్సహించటానికి బాగా రాస్తున్నాడంటున్నారు కాబోలనుకున్నా. తీరా విచారిస్తే, చాలా బాగా రాస్తాట!

నాగే : ఇంకేం ? ఆ బల్లమీది పర్సులో అయిదు రూపాయలు తీసుకుని నీ యిష్టం వచ్చినట్టు తగలెయ్... సినిమా స్టారువి కాక పోవాలి—అప్పుడు చెబుతా నీపని.

రామూ : అవుతాలే నాన్నా. ప్రతాపరుద్రీయంలో పడవ లాగేవాడి వేషం ఎంత బాగా చేశానూ?

నాగే : ఏడిశావు, కుంకా (రామూరావు నవ్వి వెళ్ళిపోతాడు.)

కాంత : అదేమిట్రా ?

నాగే : చిన్నతనంలో నేను ప్రతాపరుద్రీయంలో పడవలాగే సీనులో ఓ చిన్న వేషం వేశాలే. అందుకు నన్ను వెటకారం చేస్తున్నాడు. ఆ రోజుల్లోనే ఏడు రంగారాయుడి కొడుకువేషం వేశాడు. తాను గొప్పనటుడనీ, నేను కాననీ వాడి ఉద్దేశం.

కాంత : వాడికేం రా? నిక్షేపమంటివాడు! శరీరపుష్టి లేదు, వరహీనమవుతుందని చూస్తున్నాగాని, లేకపోతే మా రుక్మిణి నిచ్చి చేసేవనే!

నాగే : వాళ్ళిద్దరికీ మూడు నెల్లేగా తేడా? పైగా, అది ఈ రెండేళ్ళలో చప్పున ఒడ్డూ పొడుగూ తేరి కూచుంది. మా వాడిప్పుడు దానిపక్కన తమ్ముడల్లే ఉంటాడు.

కాంత : కనకనేగా నాకీ అవస్థ ?

సీత : (వస్తూ) ఇదుగోనండీ కాఫీ ... ... ఏమండోయ్, విన్నారా? (గొంతుతగ్గించి) ఆ పనిచేసే ముండ చెప్పింది —రాత్రి మెయిలుకు ఇద్ద రాడవాళ్ళు దిగారుట — ఒళ్ళంతా కనిపిస్తూ చీరెలూ, మెలికలు తిప్పుకొన్న జుట్లూ వాళ్ళూనూ. అది వాళ్లని వర్ణిస్తుంటే నాకు ఒళ్లంతా గరిబొడిచింది.

నాగే : ఈ సార్వభౌమరావెవడో ఉద్దండపిండంలాగున్నాడే?

కాంత : ఇటువంటివాళ్ళు పొరుగున చేరితే మీ రింకా సంసారా లేం చేస్తారూ? ఈ పచ్చికలి ఏమిటో అంట!

నాగే : అట్లా కాదులే. ఈయన్ని పెందలాడే వెళ్లగొట్టాలి సిందే. సబిన్స్పెక్టర్ పట్టాభితో సూచనగా అంటా. మిగతాపని అతనే చూస్తాడు.

కాంత : ఆయన్ను వెళ్ళగొట్టడం ఒకటే కాదు. నా కా యిల్లు వచ్చేట్టు కూడా చూడు, నీకు పుణ్యంఉంటుంది

నాగే : ఈసారి పోనిస్తానా?

కాంత : అయితే నేను వెళ్ళిరానా? ఆఫీసుకు టయిమవు తున్నది

నాగే : సరేలే. మళ్ళీ కలుద్దాం. (లోపలికిపోతూ) స్నానం చెయ్యొచ్చు టే?...

# రెండవరంగం

సీతమ్మ : అబ్బ! ఇవా ళెంత ఉక్కగా ఉందో! మంచాలు బయట వెయ్యనా?

నాగే : రాముూ, అమ్మకు తోడువెళ్ళి మంచాలు బయటికి చేర్చరా.

రాముూ:(ఉత్సాహంగా) ఫోటోలివాళ పోస్టుచేశా, నాన్నా.

నాగే : చేస్తే చేశావులే, లోపలికి వెళ్ళి మంచాలు లాక్కురా...వరండాలో కూచున్నా పెట్టెలో ఉన్నట్టే ఉంది.

సీత : ఇంత ఉక్కలో కూడా ఎదటింటివాళ్ళు, చూశారా, కిటికీలు కూడా తెరవరు? అసలింట్లో ఎవరూ ఉన్న అలికడే లేదు. వాళ్ళంతా ఏం చేస్తుంటారండీ?

నాగే : నే మాత్రం చూశానుటే? నాకేమైనా దివ్యదృష్టి ఉందా?

సీత : కాకపోయినా వాళ్ళతో నేను పడే బాధ మీ కేం తెలుస్తుంది?

నాగే : (ఆత్రంగా) నీ కా యింటో వాళ్లు కనిపించారా ఏం?

సీత : కనపడకుండానే కాల్చుకుతింటున్నారు ... పొద్దున కూరలది వీధిలోకి వస్తే కేకేశా, నాకన్న ముందు వాళ్ళు కేకేశారుట. అక్కడ ఇచ్చి వస్తానని వెళ్ళింది. వెళ్లే టప్పుడు దాని తట్టలో చక్కని వంకాయలున్నాయి. అందులో సగం వాళ్ళు కొనేశారుట! అది తిరిగి వచ్చే ప్పటికి నాకు కుళ్ళిపోయినవీ, పుచ్చులూ, చచ్చులూ మిగిలాయి. ఎట్లా ఇచ్చావే అంటే వీశె ముప్పావలా అన్నది. కావలిస్తే ఎదటింటివాళ్ళుకొన్నారు అడగమన్నది. ఇటువంటివాళ్ళు మన పొరుగున దాపరిస్తే ఇంకేం బతికేట్టూ? వంకాయలు వీశె ముప్పావలా ఏమి టండీ ? ఎవరన్నా వింటే నవ్విపోతారూ!

నాగే : పట్టాభితో ఒకమాట చెబుదామంటే పడకుండా ఉంది. వీళ్ళ అంతు అతనైతే తేల్చును. (కాంతయ్య వస్తాడు) రా, కాంతం. భోజన మయిందా ?

కాంత : ఆహా!...ఇవాళ గాలి బొత్తిగా బిగదీసింది. మా కొంప తెలుసుగా ? అన్నం తింటున్నంతసేపు ఎప్పుడు బయట పడదామా అనే! బయటనన్నా కాస్త చల్లగా ఉంటుందేమోనని షికారుగా వచ్చా.

నాగే: అట్లా మంచాలమీద కూచుందాం...మనం ఉక్కకి ఇంతగా ఉడికిపోతున్నామా? ఆ ఎదటింటివాళ్ళు, చూడూ, పగలయేది, రాత్రయేది ఆకటికీలు తెరిస్తే ఒట్టూ.

కాంత: ఆయింటికేం? రాజాయిల్లూ! చల్లగా ఉంటుంది— ఎంతవేసవిలో అయినా సరే.

నాగే: ఇల్లు చల్లదనంమాట సరే—కిటికీలు కూడా మూసి ఆ కొంపలో ఏం గూడుపుఠానీ చేస్తున్నారా అని!

కాంత: అదా నువ్వనేదీ...గూడుపుఠానీ అంటే జ్ఞాపకం వచ్చింది. (గొంతు తగ్గించి) ఈసార్వభౌమరావు రాబడి పన్ను ఎగ్గొట్టేవాళ్ళమీద రహస్యవిచారణ జరిపే వాడని నా అనుమానం.

నాగే: నిజంగానా?

కాంత: విను. ఈ సార్వభౌమరావు వరసగా రెండురోజులు పరాంకుశంగా రింటికి వెళ్ళి ఏదో వ్యవహారాలు మాట్లాడి నట్టు మాట్లాడివచ్చాట్ట. మూడోనాడు ఇన్కంటాక్సు వాళ్ళొచ్చి పుస్తకాలన్నీ తణిఖీచేశారు. కేసూ!

నాగే: నే నింకోమాట విన్నా. బారిస్టరు సీతారామయ్య గారున్నారు చూడూ —

కాంత: ఆయన యిల్లు నిన్న ప్రొహిబిషన్‌వాళ్ళు సోదా చేశారుగా!

నాగే: అదికూడా ఎదటింటాయన కట్టుకున్న పుణ్యమే అని బసవేశ్వర్రావు నాతో సూచనగా అన్నాడు.

కాంత: (నిర్ఘాతంపోయి) ఓరి పీడి కడుపుడకా! అంతపనీ చేశాడుగా?

నాగే : అనే అనుకోవాలి మరి ( మాధవరావు వస్తాడు ) మాధవరావుగారా ఏమిటి ? దయచెయ్యండి, దయ చెయ్యండి.

మాధ : మెయిలుకు టైము కావచ్చిందండీ. తొందరగా వెళ్లాలి. సార్వభౌమరావుగారికి సౌకర్యంగా ఉందో లేదో కనుక్కుపోదామని వచ్చా...అద్దెకుండేవాళ్ళు ఇల్లెలా చూచుకోవాలో నిజంగా ఆయనకే తెలుసండీ ! సుఖ పడటం చాతయిన మనిషి.

నాగే : ఆమాట మీా రనాలిసిందే ! ఈ వారంరోజులుగా ఆ కిటికీ రెక్కలు తెరిచిన పాపానపోతే ఒట్టూ ! సుఖం ఎరగని మాబోటివాళ్ళం ఉక్కకు తట్టుకోలేక, నేలంతా కడవల కొద్దీ నీళ్ళుపోసి తడుపుకుని, దానిమీాద మంచాలు వేసు కుని, అప్పటికీ గాలి చాలక నానా అగచాట్లూ పడు తున్నాం.

మాధ : ఈ బాధంతా ఆయనకు లేదే. తూర్పువక్క రెండు గదులూ ఎయిర్ కండిషనింగ్ చేయించుకున్నారు. గంట సే పాగదిలోకూచుని బయటికివచ్చేసరికి వడదెబ్బ తగిలినట్ట యిం దనుకోండి ! పాపం, కిటికీతలుపులకు అద్దాలు లేని కారణంచేత, పగలుకూడా గదుల్లో దీపాలు వేసుకుంటు న్నారు. నాకే సిగ్గయింది. ఖర్చయితే అయింది, పెట్టిస్తా నన్నా. ఇంకో మూాడువారాల భాగ్యానికి దేనికి లెమ్మన్నారు.

నాగే: అదంతా మాకేం తెలుసు మరీ ?...అయితే చూడండీ, ఆయనకేంపనో మీా రేమన్నా విచారించారా ?

మాధ : ఆయనవనితో నా కేంపని చెప్పండి ? నేనడగలేదు.

నాగే : ఆ, మరేంలేదు, ఆయనా ప్రొహిబిషన్ సి ఐ డి అని ఎవరో అంటేనూ...

మాధ : అయితే కానివ్వండి ... రహస్యంగా తాగేవాళ్ళకి బాధగాని, మనకేం ?

కాంత : ఒకవేళ ఇన్‌కమ్‌టాక్స్ సీఐడీ అయినా కావచ్చు.

మాధ : ఎవరైతే మనకేమిటి చెప్పండి? పనీపాటా లేనివాళ్ళం వారినిగురించి, వీరిని గురించీ ఏమేమో అనుకుంటాంగాని. ఆయనవంటివాడు ఇంకొకర్నిగురించి ఆలోచిస్తాడా ? వస్తానండీ. నాకు రైలువేళయింది.

నాగే : మాధవరావుగారూ, ఒక్కమాట... ఈ సార్వభౌమరావుగారిని మేమెవరం చూడలేదు. ఆయన వయస్సెంత ఉంటుంది ?

మాధ : యాభై ఉంటుంది. కాని చాలా చలాకీ మనిషి. ఇంకా తక్కువున్నట్టు కనిపిస్తాడు.

నాగే : ఆయన వెంట 18, 20 వయసుగల పిల్లలున్నారట. వాళ్ళెవరండీ ? ఆయన కుమార్తెలా ?

మాధ : (ఆశ్చర్యంగా) పిల్లలా ? ఆయింట్లో ఆడవాళ్ళెవరూ లేరే ? మీరు పొరపడిఉంటారు. ఆ యింట్లో ఉన్నదల్లా ఆయనా, ఆయన కొడుకూ, వంటవాడూనూ. వెళ్ళొస్తానండీ. (పోతాడు)

నాగే : ఆడవాళ్ళు లేరూ ! ఇదంతా మాయసభల్లే ఉందే ! ఆడవాళ్ళను చూశానని మా ఆవిడతో పనిమనిషి చెప్పిందిట ?

కాంత : వెళ్ళిపొయ్యారేమో.

నాగే : ఎప్పుడు వచ్చినట్టు, ఎప్పుడు వెళ్లినట్టు ?...చూడు, కాంతం ! నీ కా యిల్లు బాగా తెలుసుగదా, అందులో ఆడవాళ్ళ నెక్కడన్నా దాచటానికుందా ?

కాంత : దాస్తే, నీళ్ళగదిలో దాయాలి.

నాగే : అవును—దాచారేమో ?

రామా : (అంతకుముందే వచ్చికూచుని) ఇదంతా ఏదో డిటెక్టివ్ కథల్లే ఉంది, నాన్నా !

నాగే : నువెప్పుడొచ్చావురా ? చదువూసంధ్యా లేవా ఏమిటి ?

రామా : చదవటం పూర్తిచేసే వచ్చా, నాన్నా.

నాగే : అట్లా అయితే ఆ మంచంమీద పడుకుని నిద్రపో... అమ్మ ఇంకా లోపల ఏం చేస్తున్నదీ ?

రామా : ఊరగాయ కలుపుతున్నది...సరేగాని, నాన్నా, ఎదురింటాయన సంగతి తమాషాగా లేదూ ?

నాగే : తమాషా నీకూడా తెలిసిందీ ?

రామా : నేను కళ్ళారా చూస్తేనే ?

నాగే : ఏం చూశావు నువు ?

రామా : పెద్దబట్టలషాపులో ఈ ముసలాయన ఇవాళ దీపాలు పెట్టేవేళ డజను చీరెలు కొన్నాడు. నాలుగువందల రూపాయల బిల్లు, నా కళ్ళారా చూశా.

నాగే: మరి మాధవరావు యింటో ఆడపురుగే లేదంటాడేం? వొట్టి మన్నుదిన్నపాము ! నన్నడిగితే ఆ యింటో ఏదో పెద్ద తతంగమే జరుగుతున్నది. ఈసార్వభౌముడు ఏ సీఐడీ

కూడా కాదు. సందమంది సీఐడీలు వీడి వెంటబడితేనేగాని ఆ మూసిన కిటికీల వెనక ఏం జరుగుతున్నదీ తెలీదు.

కాంత : అసలు కిటికీలు ముయ్యటానికే గదులు ఎయిర్ కండిషన్ చేశాడేమో, అది చూడు !

నాగే : ఆమాట నిజంరా ! భలే పట్టావు మోసం!...పిచ్చి ముండాకొడుకు, మాధవరావు, ఎయిర్ కండిషనింగ్ ప్లాంట్ చూసి ఢంగైపోయినాడు...గదులు చల్లగా ఉండటానికే పెట్టాడయ్యా, అద్దాల తలుపులు పెట్టిస్తానంటే వద్దనటమేం ?

కాంత : దానికి సమాధానం చెప్పు !...నువ్వన్నట్టు ఇందులో ఏదో తిరుగుడుంది. అన్నట్టు, నువ్వు పట్టాభితో మాట్టాడావా ?

నాగే : ఏదీ? మొదట మరిచేపోయినా. తరవాత నాకు తీరలా. ఇంతలో ఈయన సీఐడీ అని బసవేశ్వరరావు నాతో అన్నాడు. నేను నమ్మా. (సీతమ్మ వస్తుంది)

కాంత : ఏమండీ, అక్కగారూ, ఊరగాయి పెడుతున్నారా ?

సీత : పెట్టటం మొన్ననే పెట్టాం. ఉప్పూ, నూనే చాలనట్టు కనిపిస్తేనూ...ఈసారి మా ఆవకాయికి మంచి కారం పడింది లెండి. తెడ్డుతో నూనెతీస్తే నెత్తురల్లే ఉంది !

కాంత : ఏదీ, మా యింటో ఇంకా పెట్టలా. వీలు చూసుకుని అన్నీ తెచ్చి పడెయ్యాలి...ఆఁ, చాలా పొద్దుపోయినట్టుంది. ఊరంతా మాటుమణిగింది. నేను రాలేదని మా ఆడవాళ్ళు తిట్టుకుంటూ ఉంటారు. మా దిక్కుమాలిన పేటలో పట్టపగలే దొంగల భయం ! కిందటేడు

మధ్యాహ్నం రెండుగంటలప్పుడు మా ఇంటిపక్కసందులో హత్య జరగలా ? (ఎదటింటినుంచి ఒక స్త్రీ ఆర్తనాదం కర్ణవిదారకంగా వినిపిస్తుంది. తరవాత, బొంగురుగొంతు, "చావు ముండా !"...కాస్సేపు నిశ్శబ్దం. ఇక్కడినుంచీ ఈ రంగంచివరిదాకా అందరూ రహస్యంగానే మాట్లాడ తారు.)

సీత : (వొణుకుతూ) ఏమిటండీ అదీ ?

రామా.: (భయంతో) హత్య. నాన్నా ! ఎవరినో పొడిచి చంపేశారు.

నాగే : పోలీసుల్ని పిలుస్తామా ?...ఏం, కాంతం ?

కాంత : మన కెందుకొచ్చిన పీడ !

నాగే : గుట్టుచప్పుడుకాకుండా కళ్ళుమూసుకు పడుకుందాం.

కాంత : అయితే మీరు పడుకోండి. నే పోతా.

నాగే : కొంచెం ఆగు. వీధిలో ఎవరూ లేకుండాచూసి మరీ పోదూగాని.

కాంత : అదీ నిజమే...ఈ కేకవిని ఎవరన్నా వచ్చేదీ లేనిదీ ఇంకో అయిదు నిమిషాల్లో తేలిపోతుంది.

సీత : ఎంత భయంకరమైన కేకో ! నా చెవుల్లో ఇంకా గింగురుమంటూనే ఉంది...ఉక్కయితే అయింది, లోపలే పడుకుందామండీ !

నాగే : నువ్వాయినదానికీ, కానిదానికీ, భయపడకు...ఏదీ ? మళ్ళా ఏ చప్పుడూలేదు కాంతం, ఎవరినన్నా చంపారే అనుకుందాం. చచ్చేమనిషి అంత కేకపెట్టాక హంతకుడు, "చావు ముండా" అని అట్లా అరుస్తాడా ?

కాంత : నువ్వు చెప్పేది మరీ బాగుంది. కోపంలో చంపేవాడికి ఆలోచనా, సాలోచనా ఉంటుందీ ? ఒట్టి కేకే అయితే మనం హత్య అనుకోనక్కర్లేదు. "చావుముండా" అన్న తరవాత హత్య కాదని ఎట్లా అనుకోవటం ?

సీత : ఇదెక్కడి పాపిష్టి పీడ వచ్చిపడిందండీ మనకూ ?

నాగే : నువ్వూరుకో !... ఇంకోటి చూశావా, కాంతం? ఆ పిచ్చిముద్దు, మాధవరావు ఆ ఇంట్లో ఆ సమయానికే లేదంటాడు గదా, ఇప్పుడు మనం విన్న కేక ఎవరు వేసినట్టూ?

కాంత : వెళ్ళిపోయినాడుగాని, ఇంకో అయిదు నిమిషాలు ఆగినట్టయితే, ఈ మాట ఆయన్నే అడిగేవాళ్ళం... ఆ తండ్రీ కొడుకు ఈపాటికి వేపచెట్టుకింద గొయ్యి త్రవ్వుతుంటారు. ఇంకాస్సేపటికి శవం మాయమవుతుంది. తెల్లారేలోపల రక్తం మరకలూ అవీ కడిగేస్తారు—

సీత : చెప్పకండీ ! అసలే భయమేసి చస్తూంటేనూ !

కాంత : ఇప్పుడిక మనం భయపడిమాత్రం చేసేదేమిటి ?... సార్వభౌమరావుమీద హత్యానేరం ఎవ్వరూ మోపలేరు. ఈరాత్రి ఆ యింట్లో ఆడదేలేదని ప్రమాణంచేసి చెప్పటానికి మాధవరావుండనే వున్నాడు. చావుకేక చెవులారా విన్నవాళ్ళం మనం సాక్ష్యం ఇవ్వంగదా!... అసలీపని చెయ్యటానికే ఇల్లు అద్దెకు తీసుకుని ఉంటాడు. రేపో ఎల్లుండో చల్లగా ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోతాడు. ఆ తరవాత ఆ యిల్లు ఊరికే ఇచ్చినా నా కక్కర్లేదు. ఒకొకంటే బలుసాకు తినొచ్చు; హత్య జరిగిన కొంపలో తెలిసి నే నుండలేం !

రామా : వాళ్ళు గోడదూకి లోపల ఏంజరుగుతున్నదో చూసి రానా, నాన్నా ?

నాగే : (పళ్లు బిగబట్టి) నువ్వూర్కోరా !

కాంత : చూడు, నాయనా రామారావ్, పెద్దవాణ్ణో చిన్నవాణ్ణో చెబుతున్నా. ఈ విషయం పొరపాటున కూడా ఎవరిదగ్గిరా ఎత్తవద్దు. నీ పరీక్ష లేమిటో నువ్వు చూసుకో. హత్య అంటూ జరిగినాక అది ఎప్పటికైనా బయటపడితీరుతుంది. దాన్నిగురించి ఎవరికేమాత్రం తెలిసినట్టు కనబడ్డా, ముందు ఎరెస్టుచేసి తరవాత మాట్లాడతారు...చాలా పొద్దుపోయింది. నే వెళ్లొస్తా. మీరందరూ జాగర్త సుమా ! (వెళతాడు)

సీత : నాయనా, మంచాలు కాస్త లోపలికి పట్టరా.

రామా : చచ్చేట్టు బయటికి చేరేశానుగదా, మళ్ళీ లోపలికేమిటమ్మా ?

సీత : నేను చచ్చినా బయటపడుకోను.

నాగే : పోనీ నువ్వు లోపల పడుకో.

సీత : నే నొక్కత్తెనూనా ? ఇంకానయం! (ఆగి) అదుగో వినండి!...అది కొళాయి చప్పుడు కాదూ ? (కొళాయి చప్పుడు వినిపిస్తుంది) వాళ్ళు చేతులు కడుక్కుంటున్నారు!

—:o:—

# మూడవ రంగం

నాగేశ్వరం ఇల్లు : సాయంకాలం

మాధవరావు : నాగేశ్వరంగారూ, నాగేశ్వరంగారూ !

నాగే : మాధవరావుగారే ! దయచెయ్యండి దయచెయ్యండి. ఎప్పుడు రావటం ?

మాధ : రైలు దిగివస్తున్నా.

నాగే : ఎప్పుడు కనిపించినా వెళుతూ కనిపిస్తారు గాని, వస్తూ కనిపించరు. ఇవాళేదో విశేషం ఉంది...కొంచెం మంచి తీర్థం తెప్పిస్తా.

మాధ : అవసరంలేదు... ఇవాళేం చిత్రమో చల్లగా ఉంది. రైల్లో కూడా నాకేమీ శ్రమకలగలా.

నాగే : మీరు తాపీగా వచ్చికూచుని మాట్లాడటమే విశేషం. అందుకనే ఇవాళ మబ్బుమబ్బుగా ఉంది.

మాధ : నన్నుగురించి మీకలాటి భావం ఉంది ఏం, చెయ్యనూ ?...కిందటిసారి ఇల్లు మీకు చెప్పకుండా మరొకరి కిచ్చినందుకు గట్టిగా మందలించారు. అలాటి పొరపాటు మళ్ళీ జరక్కుండా మీకీ సారి ముందే చెబుతున్నా. ఈ రాత్రికి ఇల్లు ఖాళీ అవుతున్నది. మీ చిత్తం వచ్చినవారి కివ్వొచ్చు.

నాగే : సార్వభౌమరావుగారు ఇల్లు ఖాళీచేస్తున్నారా ఏం ?

మాధ : అవును. ఆయన ఉత్తరం రాస్తేనే వచ్చా. నెలరోజు లుంటామన్నారు. ఇరవైనాలుగు రోజులే ఉన్నారు. వెళ్ళి పోతున్నారు. వారి పని అయిపోయినట్టుంది.

నాగే : ఏనాడో అయిపోయింది.

మాధ : ఏమిటన్నారూ ?

నాగే : అయిపోకపోతే ఉండేవారేగా!

మాధ : నిజమే...ఇందర్నీ చూశాను గానివ్వండి, అద్దెకుంటే వారిలో సార్వభౌమరావుగారంటివారు బహు అరుదు.

నాగే : దానికేమీ సందేహం అక్కర్లేదు...అటువంటివారు ప్రపంచమంతా గాలించినా దొరకరు.

మాధ : కరెక్టుగా చెప్పారు...ఏమండీ, నూరు రూపాయలిస్తిరి, నెలనాళ్ళు ఉండకపోతిరి, ఇంటి అద్దె నెలకు యాభయ్యో, కనీసం యాభయ్యైనా తిరిగి పుచ్చుకోండి అంటే ససేమిరా విన్లేదు.

నాగే : ఆయన కా యిల్లువల్ల కలిగిన లాభంలో ఈ యాభై ఏపాటిలెండి ?

మాధ : ఇంటివల్ల లాభమా ?

నాగే : ఏం లాభం లేకుండానే ఈ యిల్లు తీసుకుని, దానిమీద ఇంత ఖర్చుచేసి, ఇన్నాళ్ళూ ఎవరికంటా పడకుండా ఇక్కడ ఉన్నారా ?

మాధ : (నొచ్చుకుని) మన సార్వభౌమరావుగారిమీద ఏదో దురభిప్రాయం ఉన్నట్టు తోస్తున్నది. నిజంగా ఆయన చాలా పెద్దమనిషి. మీ రాయన్ని ఎరిగుంటే ఇలా మాట్లాడరు.

నాగే : మాధవరావుగారూ, నే నొకటి చెబుతాను వినండి. ఈ సార్వభౌమరావుగారిని నే నింతవరకు చూసినపాపాన కూడా పోలేదు. ఆయన్నిగురించి నా కే అభిప్రాయమైనా ఉంటే దానికి ఆధారాలు ఆయన కల్పించినవే అనుకోండి.

మాధ: మీ కాగ్రహం తెప్పించటాని కాయన ఏం చేసి ఉంటారబ్బా ?

నాగే: నా కాయన ఆగ్రహమే తెప్పించారని మీ రెండు కనుక్కోవాలీ ? ఆయనలో మీ కున్నంత గురి నాకులేదు, అంతే ! మీరు నాకు అన్నలాంటివారు. మనం ఎదురెదురిళ్ళవాళ్ళం. మీ మంచికోశే చెబుతున్నా ననుకోండి- ఇల్లు ఖాళీచేసి పుచ్చుకునేముందు, ఇల్లూ దొడ్డీ కాస జాగ్రత్తగా పరీక్షించి మరీ పుచ్చుకోండి. తరవాత పీక మీదికివస్తే చేసేది ఉండదు.

మాధ: ఏమిటండీ, చిత్రంగా మాట్లాడుతున్నారూ ? పీకల మీదికి రావటమేమిటి ? ఇల్లూ దొడ్డీ పరీక్షించటమేమిటి?

నాగే:దొడ్లో ఏమన్నా తవ్వినజాడ లున్నాయేమో చూడండి.

మాధ: (అయోమయంగా) తవ్వటమా ? దేనికి తవ్వటం? ఎవరు తవ్వటం ?

నాగే: అంత అమాయికంగా మాట్లాడతా రేమండీ?పాదులు వెయ్యటానికి దొడ్డి తవ్వుకోరూ ?

మాధ: అందులో తప్పేముందీ ?

నాగే: తప్పేమీలేదు. కాని, దొడ్డి తవ్వినట్టుగా ఉండి, పాదులుమాత్రం లేకపోతే అది ఆలోచించ వలసిన విషయమేగా ?

మాధ: పాదులు వెయ్యనివారు ఉత్తినే తవ్వుతారా?

నాగే: ఊరికే ఎందుకు తవ్వుతారులెండి? తవ్వితే పాదుల కోసం తవ్వాలి, లేకపోతే మరెందుకైనా తవ్వాలి.

మాధ: మరెందుకై ఉంటుందని?

నాగే : తప్పాటంమటుకు జరిగి పాదులు కనిపించకపోతే చెప్పండి పై విషయాలు అప్పుడు చెబుతాను.
మాధ : మీరు నన్ను చాలా కంగారు పెట్టేస్తున్నారు.
నాగే : కొంపతీసి, నేనిట్లా అన్నానని ఎవరితోనన్నా అనేరు! ...ఇది మీ క్షేమంకోరి చెప్పాను.
మాధ : నే నెవరితోనూ అనన్లెండి. కాని మీ కేవైనా అనుమానాలుంటే, వాటికి కారణంలేదని నా గట్టినమ్మకం. (రామారావు వస్తాడు) ఏమోయ్, రామారావ్; పరీక్షలయిపోయాయా?
రామా : అయిపోయినయ్యండి.
మాధ : బాగా రాశావా?
రామా : ఫస్టుగా రాశానండి.
మాధ : భేష్, ఫస్టుక్లాస్‌లో పాసే కా ! ... అయితే, నాగేశ్వరంగారూ, ఇంటి కెవరినో చూస్తానన్నారు, వారు తీసుకోవటానికి సిద్ధంగా ఉన్నారా?
నాగే :వారు కిందటి ఒకటో తేదీకైతే తీసుకునేవారే. ఇంకో యిల్లు చూసుకున్నారు.
మాధ: అయితే మరొకరడుగుతున్నారు. మాట ఇచ్చెయ్యనా?
నాగే : అవశ్యం ఇచ్చెయ్యండి,
మాధ : మరి నేను వెళ్ళొస్తా.
నాగే : మంచిదండి. (మాధవరావు వెళతాడు)
రామా : ఏం, నాన్నా? ను వక్షింతలు వేసినట్టే అయిందే? ఆ సినిమా కంపెనీవాళ్లు అతీగతీ లేదు,నాన్నా, వాళ్ళకోసం

అయిదు రూపాయలు తగలేసి ఫోటోలు తీయించుకున్నానూ.

నాగే : పోతే పోయినై లేరా వెధవ అయిదురూపాయలూ. నీ తృప్తికోసం ఇచ్చానేగాని, అందువల్ల లాభం ఉండదని నా కానాడే తెలుసు.

రామా : (సంకోచంగా) ఇంకో అయిదురూపాయలుంటే ఇయ్యి, నాన్నా!

నాగే : మళ్లీ దేనికిరా?

రామా : అయిందేదో అయింది. నాన్నా, వ్రితం చెడ్డా ఫలమైనా దక్కాలి. ఆ ఫోటోల కాపీలు కొన్ని తీయించి ఫిలింకంపెనీల కన్నిటికీ పంపితే ఏదో ఒకరాయి తగలొచ్చు. ఏమంటావ్?

నాగే : నీ తెలివి అఘోరించినట్లే ఉంది. ఒక్క బొప్పితో బుద్ధిరాలా?

రామా : (బ్రతిమాలుతూ) ఇంకొక్క అయిదురూపాయలియి నాన్నా, ఆ తరవాత సినిమా సంగతి ఎత్తితే అప్పుడడుగు.

నాగే : ఇంకేం? తగలెయ్యి. నా చొక్కాజేబులో పర్సుంది. తీసుకో.

రామా : తీసుకున్నాలే, నాన్నా. నువొప్పుకుంటావని నాకు తెలుసు.

(రామారావు పరిగెత్తి పోతాడు. కాంతయ్యవస్తాడు).

నాగే : రా, కాంతం, కూచో.

కాంత: ఎక్కడికో మనవాడు తొందరపనిమీద పోతున్నాడే.

నాగే : వాడి మొహం. నా మొహం! ఆనాడు అయిదు రూపాయలు తీసుకుని ఫోటోలు తీయించుకుని ఎవరికో పంపాడా, మళ్ళా ఇంకో అయిదురూపాలు తీసుకున్నాడు. ఫోటోలు అన్ని సినిమా కంపెనీలకూ పంపిస్తాట్ట!

కాంత : ఏమో, వాడి అదృష్టం ఎట్లా ఉందో ... చూడు, నాగేశ్వరం, అదృష్టం పండి మనవాడికి సినిమాచాన్సే దొరికిందనుకో—ముందుగా వాడికి పెళ్ళిచేసి ఉంచటం మంచిది కాదూ! మాటవరసకి చెప్పా!

నాగే : (నవ్వి) వాడి కప్పుడే పెళ్ళేమిటీ! పసితనం ఇంకా పోందే?

కాంత : పెళ్ళయి, సంసారం మీదపడితే పసితనం అదే పోదుల్తుందీ...చూడు, నాగేశ్వరం, నా కంటికి మన వాడు కొంచెంకొంచెం పుష్టిచేస్తున్నట్టే కనిపిస్తున్నది. నువ్వు గమనించలా?

నాగే : ఇవాళ వాడిమీద పట్టించావేమిటి ?

కాంత : పంచాగం చూచి మరీ వచ్చాలే. నువు ఊఁ అంటివా రుక్మిణీకి రామూకీ ముడిపెట్టేద్దాం!

నాగే : నీ యిల్లు బంగారంగానూ! అదా విషయం? అంత జారిపోయావేం?

కాంత : జారిపోవటమని మెల్లిగా అంటున్నావా? ఈ పెళ్లి నా కిష్టంలేదు. మా ఆవిడ కిష్టంలేదు, మా రుక్మిణి కిష్టం లేదు. బహుశా నీకుగాని, మీ ఆవిడకుగాని, రాముకిగాని ఇష్టం ఉండదు. అయితే అయింది. ఇష్టంలేనిపనులెన్ని చేస్తున్నాం కాం? వాళ్ళకి పెళ్ళిచేసేదాం. నువు ఊఁ అను!

నాగే: ఏదో జరగందే నువ్విట్లా తెగబడవు, ఏమయిందో చెప్పు.

కాంత : (విరక్తిగా) ఏమయిందా? నా శ్రాద్ధమయింది! పత్రికల్లో ప్రకటనలుచూసి ఇంత కాలంగా ఉత్తరాలు రాస్తున్నానా? వచ్చే జబాబులన్నీ యాభైఏళ్ళవాళ్ళ దగ్గర్నుంచీ, తిన తిండిలేనివాళ్ల దగ్గర్నుంచీనూ? రమ్మని రాస్తే నాలుగురోజుల క్రితం ఒక డొచ్చాడు. వాణ్ణిచూచి మా అమ్మాయి ఏదో చందాకోసం వచ్చాడనుకుంది! కుళ్ళు గుడ్డలు కట్టుకున్నాడు. గడ్డంమాసి ఉంది. దవడలు పీక్కుపోయి ఆకలికి మాడుతున్నవాడిలా వున్నాడు. ఉద్యోగం లేదుట. నా ఖర్చుతో పెళ్ళిచేసి ఇంటో ఉంచుకుని ఉద్యోగం ఇప్పించాలిట! సుష్టుగా భోజనం పెట్టి, పెళ్ళాంకోసం మటుకు ఇంకో ఇల్లు చూసుకోమని చెప్పా! ...అయిందా? ఇవాళ ఇంకో డొచ్చాడు. డాబుగా దర్పంగా ఉన్నాడు. కాని వయసు యాభైఏళ్ళుంటుంది. "మీరేనా కాంతయ్యగారు? మీ పిల్లకేనా పెళ్ళిచేస్తా మంటున్నారు?" అని అడిగాడు. నాకు ఒళ్ళు మండిపోయి "తమరేనా పెళ్ళికొడుకు?" అని అడిగా. ఆయన నవ్వి "నేను తగనా ఏమిటి?" అన్నాడు. ఇంతలో మా రుక్మిణి వచ్చింది. "ఇదేనా పెళ్ళికూతురు?" అన్నాడాయన. "అవును, ఏమయితే?" అన్నా. మారు మాటాడకుండా వెళ్ళిపోయినాడు...నాకు ప్రాణం సొలొచ్చింది. నువ్వు నేను చెప్పినట్లు ఒప్పుకో, లేదూ, నీఅరుగు మీద అభోజనం పడుకుంటా. తరవాత నీ యిష్టం. అక్కగార్ని పిలు. ఆవిడకూడా ఈమాట చెప్పేస్తా.

నాగే : నువ్వు తొందరపడకుండా ఉంటే-(సార్వభౌమరావు వస్తాడు) ఎవరదీ ?

కాంత : (రహస్యంగా) ఆయనే !

సార్వభౌమరావు : నన్ను సార్వభౌమరావంటారు. నేను చాలా రోజులుగా ఈ ఎదటింటిలో ఉన్నా. ఇవాళే ఇల్లు ఖాళీ చేస్తున్నాం. నా కొడుక్కి సినిమా తీయాలనే సరదా ఉంది. వాడొక కొత్తపద్ధతిలో సినిమాతీయ తలపెట్టాడు. వాడికి సౌండ్ రికార్డింగ్, ఫిలిమ్‌ఎడిటింగ్ తెలుసులెండి. సినిమాతీయ్యటం వివరాలివ్వ డెందుకుగాని, మేం చేసిన పనేమిటంటే తీయబోయే సినిమాకు కావలసిన సౌండ్ ట్రాక్ యావత్తూ ముందుగా తయారుచేశాం. ఇది తీరా అయ్యవారే అవుతుందో, కోతే అవుతుందో తెలీదు. ఒక విచిత్రమైన ప్రయత్నం మటుకు చేస్తున్నాం. ఎన్నడూ సినిమాలలో కనబడనివారిచేత వేషాలు వేయిస్తున్నాం. వారంరోజుల్లో పిక్చరు పూర్తిచేయాలని మా ఉద్దేశం. రికార్డింగుకు నెల రోజులు వేసుకున్నాం. అనుకున్న దాని కన్న ముందే అయిపోయింది...ఇంతకూ చెప్పొచ్చిందే మంటే మీ అబ్బాయి పంపిన ఫోటోలు అందాయి. ఆ కుర్రాడు సినిమాకు పనికొస్తాడని మా నమ్మకం. వచ్చే ఒకటో తారీఖుకి మీ వాణ్ణి మద్రాసులో ఈ ఎడ్రసుకు రమ్మనండి...తలవని తలంపుగా కాంతయ్యగారు కూడా ఇక్కడే దొరికారు. మీ అమ్మాయి నాకు నచ్చింది. మా వాడు స్వయంగా చూసి పోవటానికి వెళ్ళాడు. వాడి కూడా నచ్చితే పెళ్ళి ఏర్పాటు ఆలోచిద్దాం. పిల్ల

బాగుండటం ప్రధానం. మీ దయవల్ల మాకు డబ్బు కేమీ లోటులేదు.

ప్రసాద్ : (బయటినుంచి) నాన్నగారూ!

సా. రావు : రారా, ప్రసాద్.

కాంత : ఇతనేనా పెళ్ళికొడుకు?

ప్రసాద్ : అవునండీ......(నవ్వుతూ) మీ అమ్మాయిని మా నాన్న కిస్తామన్నారటగా?

సా.రావు: పిల్లని చూశావా ?

ప్రసాద్ : చూశాను, నాన్నగారూ. సరిగా నాకు కావలసిన టైప్. పెట్టించండి ముహూర్తం.

సా.రావు : కాంతయ్యగారూ, దయచేసి మీరుకూడా రామా. రావుతో బాటు ఒకటో తారీకు మద్రాసు రాకూడదూ? అంతా ఫైసల్ చేద్దాం.

కాంత : బాబూ, మద్రాసు కాదు, లండన్ రమ్మన్నా వస్తా.

సా.రావు:హడావుడిగావచ్చి వెళ్లుతున్నందుకుక్షమించాలివస్తాం.

నాగే : మంచిదండి.

కాంత : వెళ్ళిరండి, బాబూ. (వాళ్ళు వెళ్లాక) నాగేశ్వరం, నన్ను గట్టిగా గిల్లూ!

నాగే : కల కాదులే. నేను సాక్ష్యం ఉన్నా.

కాంత : (ఎవరో తన్నినట్టు) అన్నట్టు, నాగేశ్వరం, ఇల్లు...! వాళ్ళు ఖాళీచేశారు. నా కిప్పించు.

నాగే : చంపావు ! మాధవరావడిగితే నాకక్కర్లేదని చెప్పా.

కాంత : (కుంగిపోతూ) చెప్పావూ ? మళ్ళీ నీచేతిమీదుగానే పుణ్యం కట్టుకున్నావూ ? హాతోస్మి, హాతోస్మి!...

# ఇంటర్ వ్యూ

[ఒకానొక ఆఫీసులో విజిటర్లు కూర్చునేచోట, ముగ్గురు నలుగురు మనుష్యులు కూచుని మాట్లాడుకుంటున్నారు ]

1 వ అతను : సిపాయి మనపేర్లు రాసుకుపోయి గంట కావస్తున్నది. ఇంకా అతీగతీ లేదేం ?

2 వ అతను : అయ్యా వాళ్ళది కడుపునిండినబేరం. వాళ్ళ చిత్తంవచ్చినప్పుడు చూస్తారు. ఇదేమిటనటానికి మన మెవళ్ళం ?

3 వ అతను : అదేంవిటండి? మన కవతల పనులుండవూ ? వీళ్ళ తొత్తులమా ? ఉద్యోగం ఇచ్చాక మనమీద వాళ్ళ అథారిటీగాని, అందాకా వాళ్ళంతవాళ్ళు వాళ్ళూ. మనంతవాళ్ళం మనంవూ.

2 వ అతను : మీరుచెప్పేది సబబేకావచ్చుగాక. కాని వాళ్ళ దృష్టిలో వాళ్ళదగ్గిర ఉద్యోగం చెయ్యడానికి రావడమే ఓ విధమైన లోకువ.

4 వ అతను : లోకువకాకేం ? వాళ్ళు అడిగేవాళ్లూ మనం చెప్పేవాళ్ళమూనూ. ఉద్యోగాల కోసం వచ్చేవాళ్ళని వాళ్ళు ప్రశ్నలేస్తారు చూడండి. మనం ఊహించలేం. నేనిప్పటికి కనీసం ఓవంద ఉద్యోగాలకోసం ఇంటర్ వ్యూలకు వెళ్ళి ఉంటాననుకోండి. ఒక డడిగినట్టు మరొకడడగడు.

1 వ అతను : అదిగాదు. ఉద్యోగంకోసం ఎడ్వర్టయిజు చేసేటప్పుడు వాళ్ళకు కావలసిన అర్హతలు చెబుతారు కదా, ఇంకా ఈ ఇంటర్ వ్యూలు దేనికి ?

4 వ అతను : ఆ అర్హతలనుబట్టి ఉద్యోగాలిస్తారనుకున్నారా, ఏం ? చాలా పొరపాటు. ఒక ఉద్యోగానికి 35 ఏళ్ళలోపు మనిషి కావాలన్నారు. తీరా వేసుకున్నది 50 ఏళ్ళవాణ్ణి. ఏమంటారు ?

3 వ అతను : ఏమండి? ఒక్కొక్కసారి మనిషిని వేసుకున్నాక ఎడ్వర్టయిజు చేస్తారట నిజమేనా ?

4 వ అతను : నిజంకాకేం ? అది చాలాసార్లు జరుగుతూనే ఉంటుంది. వాళ్ళకాకావలసిన మనిషి ఉండనే ఉంటాడు. కాని మనిషికోసం ఎడ్వర్టయిజు చేసినట్టు రికార్డులో ఉండడానికని ఓ ప్రకటన తగలేస్తారు.

1 వ అతను : ఇంటర్‌వ్యూల్లో ఏ మడుగుతారండీ ?

4 వ అతను : దానికో రూలులేదు. అడిగేవాణ్ణిబట్టీ, ఆ క్షణంలోవాడిఖయ్యాలీనిబట్టీ, ఏది అడిగినా అడగొచ్చు. కొన్నికొన్ని రకాల ఉద్యోగాలకోసం వచ్చేవాళ్ళని ఇంటర్‌వ్యూచేసేవాళ్ళకి ఆవుద్యోగాలు ఎటువంటివో, అందులో పనిచేసేవాడు ఎటువంటి అనుభవంగలవాడై ఉండాలో తెలీదు. దాన్ని కప్పుకోవటానికి వాళ్ళు అసందర్భమైన ప్రశ్నలు అనేకం వేస్తారు. కొందరు కొన్నిప్రశ్నలనూ సమాధానాలనూ కాగితంమీద రాసుకుని, లేదా రాయించుకొని ఇంటర్‌వ్యూ చేసేవాణ్ణి ఆ ప్రశ్న వేస్తారట కూడానూ.

2 వ అతను : అదంతా సరే కానివ్వండి గాని, ఈయన ఎటువంటి వాడండీ ? ఇవాళ మనని చూసేవాడు.

4 వ అతను : అదివరకు ఒకేసారే ఈయన్ను కలుసుకున్నా. అదోరకం మనిషి. మీరే చూస్తారుగా.

2 వ అతను : భయపెట్టడు గద ?

4 వ అతను : ఇంటర్‌వ్యూ చేసేవాళ్ళు సాధారణంగా ఎన్నడూ భయపెట్టరు ?

1 వ అతను : కిందటిసారి చూసినప్పుడు ఈయన మిమ్మల్ని ఎటువంటి ప్రశ్నలు వేశాడండీ ?

4 వ అతను : అది గాంధీజీ హత్య జరిగిన రోజుల్లో. నన్నాయన మొట్టమొదట అడిగిన ప్రశ్న ఏమిటంటే గాంధీ హత్యజరిగినట్టు మొట్టమొదటిసారి విన్నప్పుడు నే నెక్కడ ఉన్నాను, ఏంచేస్తున్నాను, ఏమనుకున్నాను, అని.

1 వ అతను : ఆఁ. తరవాత ?

4 వ అతను : తరవాత గాంధీ పుట్టినరోజు అడిగాడు. నాకు సరిగా జ్ఞాపకంలేదు. ఆ మీదట ఆయన ఒకగొప్పవిషయం చెప్పాడు. గాంధీపుట్టిన తేదీ, తానుపుట్టిన తేదీ, గాంధీ పుట్టిన మాసమూ; తన అన్నపుట్టిన మాసమూ, గాంధీ పుట్టిన సంవత్సరం, తన తండ్రిపుట్టిన సంవత్సరం ఒకటేట.

2 వ అతను : భేష్. భేష్. చాలా చిత్రంగా ఉంది కాదండీ.

4 వ అతను : నా కాట్టే చిత్రమేమీ కనిపించలా, చెప్పొద్దూ.

3 వ అతను : అప్పుడా ఉద్యోగం మీకు కాలేదుగా ?

4 వ అతను : ఎందు కవుతుంది బాబూ ? ఉద్యోగా లంత సులభంగా అవుతాయా ?

1 వ అతను : ఈ సిపాయి కుర్రాడన్నా రాడేం ? ఏమిటీ ఆలస్యం ?

2 వ అతను : ఆ కాఫీ పట్టుకెళ్ళేది వాడేలాగుంది. పిలుస్తామా?

4 వ అతను : ఏమోయ్, ఒక్కమాట ... అయ్యవారేం చేస్తున్నారు ?

సిపాయి : ఎవరితోనో మాట్లాడుతున్నారండీ. కాఫీ ఆరి కోసమే.

4 వ అతను : ఇకనేం ? మరో అరగంటదాకా తొందర్లేదు.

(బెల్ మోగుతుంది. సిపాయి అడుగుల చప్పుడు. తలుపు తెరిచిన చప్పుడు, మళ్ళీ మూసిన చప్పుడు)

అధికారి : (టెలిఫోనులో మాట్లాడుతూ) అవునవును... ఓ యెస్...నేననుకున్నదే. నాకేమీ ఆశ్చర్యంలేదు ... నే నాట్టే ఆశపెట్టుకోలేదులే...ఆఁ?...ఓహో. పోనీ. వ్యరీం మంచిది...జస్ట్ ఎ మినిట్...(సిపాయితో) ట్రే ఇలా పెట్టరా. మిస్టర్ రావ్! విల్ యు ప్లీజ్ హెల్ప్ యువర్సెల్ఫ్?

మిస్టర్ రావ్ : మీకూ్కడా కలపనా ?

అధికారి: థేంక్యూ సోమచ్. నాకు ఒక్కస్పూను సుగర్ చాలు. (మళ్ళా టెలిఫోనులో మాట్లాడుతూ) హలో...ఏమన్నావూ ? (ఊకొడుతూ మధ్యమధ్య నవ్వుతూంటాడు.) సరే. మళ్ళీ మాట్లాడుకుందాం. రేపు మార్నింగ్ అంతా సెటిలయిపోతుంది.

మిస్టర్ రావ్ : మీ కాంటీన్ కాఫీమాత్రం చాలా ఎక్సలెంట్ గా ఉందండీ. రోజూ కాఫీ కోసమైనా రావాలనిపిస్తుంది.

అధికారి : రండి, జై ఆల్మేన్స్.

మిస్టర్ రావ్: అన్నట్టు ఇవాళ మీరు క్లర్కు నొకణ్ణి వేసుకుంటున్నట్టున్నారు ?

అధికారి: అవు నన్నట్టు ఇవాళ ఫిఫ్టీన్త్ కాదూ ? (బెల్ కొడతాడు) ఏమిటి ? ఎవడన్నా పనికివచ్చే వాడున్నాడా ?

మిస్టర్ రావ్ : (తలుపు తెరిచినప్పుడు) ఉన్నాడండి. అందుకే అడుగుతా.

అధి : బోయ్. ఇంటర్‌వ్యూకు వచ్చినవాళ్లెంతమంది ఉన్నారు?

సిపాయి : నలుగురైదుగురున్నారండి.

అధి : వాళ్ళ కార్డ్సేవీ?

సిపాయి : ఇవిగోనండి, పేపరువెయిటుకింద.

అధి : సరేలే. (తలుపు మూసి సిపాయి వెళ్ళినాక) మిస్టర్ రావ్! ఎవరున్నారన్నారూ!

మిస్టర్ : రావ్ : మాకు దూరపు బంధువు.

అధి : ఊళ్లో ఉన్నాడా?

మిస్టర్ రావు : లేడండి, మీరు పిలిపించమంటే పిలిపిస్తాను. ఎల్లుండికల్లా వస్తాడు.

అధి : బై ఆల్మీన్స్. ఈ ఫారంమీద అతనిపేరూ అవీ రాసి ఉంచండి. అతను వచ్చాక సంతకం చేయిస్తాం ... ప్రతి చిన్న ఉద్యోగానికి రకరకాల వాళ్ళని ఇంటర్‌వ్యూ చెయ్యటంతో ప్రాణం విసిగిపోతున్నదండీ, ఏరినట్టు తయారవుతారు. ఒకడికీక్వాలిఫికేషన్సు సరిగా ఉండవు. ఒకడూ వుద్యోగానికి పనికొచ్చేమొహంగా కనిపించడు. అసలీ సిస్టమే ఎత్తిపారేస్తే బాగుండును. చెడ్డ చిరాగ్గా వుంది.

మిస్టర్ రావు : ఇదుగో, మా వాడిపేరూ ఎడ్రసూనూ ... నేను మీ పని పాడుచేస్తున్నానో ఏమిటో. వెళ్లొస్తాను. థాంక్యూ వెరీమచ్.

అధి: నా పెటాల్, నా పెటాల్, మిమ్మల్నే థాంక్స్ చెయ్యాలి. నా బెడద చాలా తీర్చేశారు. (బెల్ కొడతాడు. సిపాయి వస్తాడు.) బోయ్. వాళ్ళను ఒకొక్కర్నే పంపు. (ఈల వేసుకుంటూ ఏవో కాగితాలు చూస్తూంటాడు.) కమిన్ ప్లీజ్. టేక్ యువర్ సీట్.

2 వ అతను : నమస్కారమండి.

అధి : నమస్కారం, నమస్కారం. మీ పేరేమిటన్నారూ?

2 వ అతను : నా పేరు కే. వి పి. ఎస్. ఆర్. శాస్త్రుండి.

అధి : అంటే ?

2 వ అతను : కానూరి వెంకట పరబ్రహ్మ సత్యరామ శాస్త్రుండి.

అధి : మీకు గుమాస్తా లనుభవం ఉందా?

2 వ అతను : ఉంది కానివ్వండి, నేను వొట్టి చచ్చువాణ్ణండి.

అధి: అదేమిటయ్యా? చచ్చువాడివైతే ఉద్యోగానికి దరఖాస్తెందుకు పెట్టావూ? ఇదే, ఇదే నీ అప్లికేషను. ఇందులో అయిదారేళ్ళ అనుభవం ఉన్నట్టు రాశావే?

2 వ అతను : అప్లికేషను రాశానే గానీండి తమవంటి ప్రభువులదగ్గిర ఎట్లా చెప్పుకోనండి.

అధి : అన్నీ వొట్టిదేనా?

2 వ అతను : ప్రాణంపోయినా అసత్యం రాస్తానాండీ?

అధి: నీ వ్యవహారం నాకంతా అయోమయంగా ఉంది. అయి దారేళ్ళ అనుభవం వుంటే వుందని చెప్పడానికేం?

2 వ అతను : ఏ ఏ పాతకమైనా చెయ్యొచ్చునుగాని ఆత్మ శ్లాఘం కూడదండి. అందులోనూ తమవంటి ప్రభువుల దగ్గిరా? ఏ చచ్చువాళ్ళదగ్గిరో అయితే పోనీ విజృంభించి-

అధి: ఇంత మొహమాటానికి పోతే నీ కున్న క్వాలిఫికేషన్సు నాకు తెలిసే దెల్లాగయ్యా?

2 వ అతను : అదేం మాటండి? తమరు మేధాసంపన్నులు, మఃషిని ఇట్టే కనిపెట్టెయ్యగలవారు. మీా దగ్గిరనా నా వేషాలూం? అమ్మా !

అధి : బలేవాడివే. పోనీ చెప్పు. నీకు కూడికల్లోనూ భాగా రాల్లోనూ చురుకుతనం వుందా?

2 వ అతను : తమ రలా అడిగితే ఏమనాలో నాకు తోచ కుండా వుంది. లెక్కల్లో నాకు దేవుడు కాస్తో కూస్తో ప్రసాదించిన దక్షత మా లెక్కల మేష్టారు ఆ శ్రీరామ మూర్తిగారు— చచ్చి ఏ స్వర్గానున్నారో (నిట్టూర్చి) హాయన్నడిగితే ఇట్టే తెలిసిపోతుందండి.

అధి : (చిరాగ్గా) నువ్వు గుణితంలో గట్టివాడివో కాదో చచ్చిన మీా లెక్కల మేష్టార్ని అడగమన్నావుటయ్యా? ఇది వేళాకోళమా, వెటకారమా?

2 వ అతను : (ప్రాధేయపడుతూ) అయింది, అనుకున్నంతా అయింది. నేను తమకు ఆగ్రహం తెప్పించేశాను. మీారు నన్ను క్షమిస్తేగాని నామనసు స్వస్థపడదు, క్షమించానలడి

అధి : సరే. అట్లాగే క్షమించాలే. ఇక నువ్వు వెళ్ళొచ్చు.

2 వ అతను : (జిడ్డుగా) క్షమించా లెమ్మంటే చాలదు. నాకు మీరు ఉద్యోగం ఇవ్వకపోయినా మానె. క్షమించానని ప్రమాణంచేస్తేనేగాని కదల్ను. ఊహుఁ. (ముద్దులుకుడుస్తాడు).

అధికారి: ప్రమాణాలూ లేవు, సింగినాదులూ లేవు ఇక వెళ్ళు.

2 వ అతను : చూశారా. క్షమించరుగాదూ. పోనీ ఏం చేస్తే క్షమిస్తారో చెప్పండి!

అధి : నువ్వేం చెయ్యొద్దు, వెళ్ళవయ్యా దేవుడా!

2 వ అతను : కనీసం నా వల్ల జరిగిన అపచారమేమిటో అదన్నా చెప్పకుండా పంపేస్తారా? మళ్ళీ మనం ఎప్పుడు కలుసుకుంటాం? నా తప్పేమిటో ఎలా తెలుస్తుంది? మీకు క్షమాపణ ఏ విధంగా చెప్పుకుంటాను?

అధికారి : నువు నా కెట్లా దాపరించావయ్యా? నాకు వేరే పనుంది వెళ్ళవయ్యా.

2 వ అతను : అయ్యో ఎంతమాట. తమవంటివారికి ఋణం తీరుతుందా? మామీద ప్రేమకొద్దీ మమ్మల్ని ఇంటర్వ్యూ చేస్తున్నారు గాని మీకు విరామం ఉందా?

అధి : నువ్విదంతా ఎందుకు మాట్లాడుతున్నావో నా కర్థం కావటంలేదు. ఇక నువ్వు వెళ్ళవచ్చునని చెప్పాను.

2 వ అతను : అదుగో. మళ్ళీ తమకాగ్రహం తెచ్చాను. మీరు నన్ను క్షమించకపోయినామానె, నన్ను సరిగాఅర్థం చేసుకోలేకపోయినారే. నా హృదయం గ్రహించ లేక పోయినారే అన్న విచారం నన్ను జాస్తీగా బాధిస్తోంది. మీరు చెబితే నమ్మరుగాని—

అధికారి : (బెల్ కొడుతూ) బోయ్, బోయ్. ( అరుస్తాడు; సిపాయి వస్తాడు ) ఈయన్ని బయటికి పంపు.

2 వ అతను: అంతపని దేనికలెండి గాని, ఒక్కమాట చెప్పెయ్యండి. నాకు ఉద్యోగం ఇస్తున్నారా లేదా? భయపడకండి, లేకపోతే లేదని చెప్పండి.

అధికారి : (అణుచుకోలేని ఆశ్చర్యంతో) భయమా? నిన్ను చూచా. నా బొందెలో ఊపిరి ఉండగా ఈ నౌకరు ఉద్యోగంకూడా నీ కివ్వను, సరా? ఇక వెళ్ళు.

2 వ అతను : చిత్రం! ఒకొక్కరు మనిషిని ఎలా కనిపెట్టలేకపోతారో. నన్ను గురించి మీకు ఆవగింజలో అరవీసం కూడా తెలీదుకద. నాకు మా హెడ్మాస్టరు ఎటువంటి సర్టిఫికెటిచ్చాడో—

అధి : (గొంతు చించుకు అరుస్తూ) గెటౌట్. (2 వ అతను వెళ్ళిపోతాడు) అమ్మయ్యా. (నిట్టూర్చి) మైగాడ్. ఎటువంటి జిగురు. సీసాల్లోపట్టి అమ్మి లక్షలార్జించవచ్చు. (2 వ అతను మళ్ళీ వస్తాడు) మళ్ళా ఏమిటీ?

2 వ అతను : మరేంలేదు. నా అప్లికేషన్ నా కిచ్చెయ్యండి.

అధి : అప్లికేషన్లు తిరిగి ఇవ్వరు.

2 వ అతను : అప్లికేషను మీ ఆఫీసులో వుండటం నా కిష్టం లేదు.

అధి : ఇవ్వటానికి వీల్లేదు.

2 వ అతను : అది పెద్దమనిషి తరహా కాదు. ఆ అప్లికేషనులో నా సంతకంవుంది. దాన్ని ఎవరైనా దుర్వినియోగపరచ

వచ్చు, ఉద్యోగం ఇవ్వనికాడికి అప్లికేషను దగ్గిరవుంచు కొని ఏం చేస్తారూ?

అధి: గో టు హెల్. ఇదుగో నీ అప్లికేషను. భద్రంగా దాచుకో. ఈసారి మళ్ళీ నాదగ్గిరికి వచ్చావంటే నే నేం చేస్తానో తెలీదు. ఈ పేపరు వెయిట్ చూశావా? వెళ్ళు (2-వ అతను వెళతాడు) బోయ్ కాసిని మంచినీళ్ళిచ్చి మరొకర్ని పంపు. అమ్మయ్య! (సిపాయి వస్తాడు) బోయ్ ఇంకా ఎంతమందున్నారు?

సిపాయి: ఇంకా ఇద్దరున్నారండి.

అధి: వెరీగుడ్. నువ్వు కాస్త అందుబాటులోవుండు. అవసరం రావచ్చు.

4 వ అతను: గుడ్‌మార్నింగ్ సర్.

అధి: గుడ్‌మార్నింగ్. గుడ్‌మార్నింగ్, మీరు అప్లికేషన్ పంపారుకదూ?

4 వ అతను: చిత్తం; పంపానండి. ఇంటర్వ్యూకు రమ్మని నాకు తమ ఉత్తరంకూడా అందింది.

అధి: ఓ యెస్, ఓ యెస్. గుడ్ గుడ్. మీ పేరు?

4 వ అతను: ప్రకాశమండి.

అధి: ఇంటిపేరు?

4 వ అతను: కళావారండి.

అధి: (అత్యాశ్చర్యంతో) హ్వాట్! చాలా ఆశ్చర్యంగా వుందే?

4 వ అతను: చిత్తం. కిందటిమారుకూడా మీరీ విషయంలో ఆశ్చర్యపడ్డారు.

అధి : ఇంతకన్న మంచి చిత్రం చెప్పనా ? నా పుట్టిన తేదీ 2. మా అన్న పుట్టింది అక్టోబర్లో. గాంధీజీ —

4 వ అతను : చిత్తం. ఈ విషయంకూడా నాకు తమరు కిందటి సారి చెప్పారు.

అధి : అలాగా ! మనం కలుసుకోవటం ఇది మొదటిసారికాదా ఏమిటి ?

4 వ అతను : కాదండి. నేను 1918 ఫిబ్రవరి 9 న తమ దర్శనం చేసుకున్నా.

అధి : అలాగా...మీ చేతిలోది ఏమిటదీ ? ఇలస్ట్రేటెడ్ వీక్లియే ?

4 వ అతను : చిత్తం.

అధి : లేటెస్టే ?

4 వ అతను : అవునండి.

అధి : క్రాస్ వర్డ్ పజిల్స్ వేస్తూంటారా ఏం ?

4 వ అతను : వేస్తుంటానండి.

అధి : ఎప్పుడన్నా ప్రైజ్ కొట్టారా ?

4 వ అతను : మూడుసార్లు వన్ ఎర్రర్ ప్రైజు వచ్చిందండి. టూ ఎర్రర్ ప్రైజెస్ చాలాసార్లు వచ్చాయి.

అధి : (అసూయతో) నయమే. నా కింతవరకు ఏ ప్రైజూ రాలేదు...చూడండి ఎనిమిది డౌన్ ఏం వేస్తున్నారు, బైండా, కైండా, మైండా, వైండా ?

4 వ అతను : అక్కడ ఫైండ్ సరిపోతుందనుకుంటానండి.

అధి : నా కలా తోచడంలేదు. ఏమైనా ప్రైజులు కొట్టిన వాడివి కనక నిన్ను కాదనటానికి లేదు...పోతే ట్వెంటీ

టూ ఎక్రాస్ ఏం వేస్తున్నారు? వార్టా, వార్డా, వార్నా, వార్మా ?

4 వ అతను : నాకు వేర్ బాగా ఉన్నటు తోచిందండి.

అధి : వేరా ? ఒక్కనాటికీ కాదు.

4 వ అతను : మీరన్నది నిజమేనండి. చెప్పలేం !

అధి : (అనుమానంతో) నువ్వు నిజంగా వేర్ వేస్తున్నావా ఏమిటి ?

4 వ అతను : ఈ సారి కది బేంకర్ గా పెట్టుకున్నానండి.

అధి : పోనీ అదికూడా ఒక ఆల్టర్ నేటివ్ గా వేసి చూస్తాను. ఇంతలో పోయిందేమిటీ ? పదిహేడు డౌన్ ఏమిటీ ? పోలా, మోలా, సోలా, రోలా ?

4 వ అతను : రోలే కాస్త బాగుందేమోనండి.

అధి : నేనూ అలాగే ఫీ లయాను. ఈ సారి బంపర్ కొట్టాలని ఉంది. 36 సొల్యూషన్లు పంపిస్తున్నాను. ఏ చిన్న ప్రైజన్నా రాకపోతుందా అని.

4 వ అతను : రాకేం చేస్తుందండి.

అధి : నీకేదన్నా సిస్టం ఉందా ?

4 వ అతను : పెద్ద సిస్టమేమీ లేదండి. అనేక పేపర్ల వాళ్ళు తమ సొల్యూషన్లు వేస్తారు చూడండి. వాళ్ళందరికీ నాలు గేసి తప్పులు వచ్చేలాగ సొల్యూషను తయారుచేస్తానండి. ఎప్పుడన్నా తగులుతుంది.

అధి : భేష్. నీయుక్తి బాగుందిసుమా. ఈసారి ఆపని చేసి చూస్తాను.

4 వ అతను : దానిమీద ఆధారపడకండి, అట్టే, అప్పటికీ అనేకవేల సొల్యూషన్లుంటాయి.

అధి : (ఆశ్చర్యంగా) అలాగా?...అన్నట్లు అసలుపనికి వద్దాం ...(కాగితాలు తిప్పుతూ) ఇదుగో, మీ అప్లికేషన్ (చదువుతూ) కే. ప్రకాశం...బియ్యే. 1939, ఆనర్సు మేథమెటిక్స్...పార్టు ఎక్స్పీరియన్స్ 3 ఏళ్లా? అది కూడా ప్రెస్ ఎకౌంట్స్ లో. ఐయామ్ సారీ, మాకు కనీసం ఐదేళ్ళ అనుభవం ఉన్నవాడు కావాలి. అయినా మీ కన్న క్వాలిఫైడ్ మాన్ దొరకకపోతే తెలియజేస్తాను. కాని అంతకంటె హోప్ ఇవ్వలేను. గుడ్ డే.

4 వ అతను : శలవండి.

అధి : (బెల్ కొడతాడు. సిపాయివస్తాడు) బోయ్. ఇంకో కర్ని పంపించు (సిపాయి పోతాడు) డామిట్. (బెల్లు గబగబా కొడతాడు, సిపాయి మళ్ళీవస్తాడు) బోయ్ పరిగెత్తుకుపోయి ఇప్పుడు వెళ్ళిపోయినాయన్ను పిలుచుకురా... మిస్టర్ రావు చెప్పిన మనిషి అతనే.

సిపా : (అనుమానంగా) అయ్యా ?

అధి : (తొందరగా) ఇప్పుడు వెళ్ళిన మనిషిని అర్జంటుగా పిలుచుకురారా.

సిపా : చిత్తం...(పరిగెత్తుతాడు)

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)

—:o:—

# మధ్యవర్తులు

స్థానం - రాధ ఇల్లు

కాలం - ఒకనాటి సాయంకాలం, దీపాలుపెట్టే వేళ.

పాత్రలు - రాధా, దాసు.

దాసు : [తలుపు తట్టి]—ఎవరండీ లోపలా ?

రాధ : [లోపలనించి గట్టిగా] ఎవరువారు ?

దాసు : కొంచెం తలుపు తీస్తారా ?— [రాధ తలుపు తెరిచింది] జానకీదేవిగా రుండేది ఇక్కడేనాండి ?

రాధ : అవును. లోపలికి రండి. అలా కూర్చోండి. ఏం పని మీద వచ్చారు ?

దాసు : తమతో ఒక ముఖ్య విషయం మాట్లాడి పోదామని వచ్చాను. పై వాళ్ళెవరూ లేరు కద ?

రాధ : ఆశ్చర్యంతో - న్నాతోనా ? మీ రెవరోకూడా—

దాసు : నాపేరు దాసంటారండి. నేను శివానికి ప్రాణ స్నేహితుణ్ణి. లేకపోతే, నేనింతదూరం వచ్చిఉండను. [కొంచెం కోపం తెచ్చుకుంటూ] మొహాన అంటున్నానని కోపగించకండి, మీరు మా శివానికి చాలా అన్యాయం చేశారు.

రాధ : [కంగారుగా] నే నసలు— నా కస లే దురుద్దేశమూ లేదు. ఎంతో సదుద్దేశంతోనే ఆపని-శివంగారికి రహస్యం తెలిసించా ఏమిటండీ ?

దాసు : ఇలాటి రహస్యా లెక్కడైనా దాగుతాయాండి ? మీ రిప్పటికైనా ఈ ప్రయత్నం మానుకుంటే చాలా

బాగుంటుందని నే సలహా ఇస్తున్నాను. మధ్య జోక్యం కలిగించుకున్నందుకు క్షమించండి. శివం నా ప్రాణ స్నేహితుడు కాకపోతే నేనింతదూరం—

రాధ: వచ్చివుండరు. అవును. నాది పొరపాటే. ఒప్పుకుంటాను. అయినా నా కెందుకొచ్చిన బాధలెండి.

దాసు: [ తృప్తిపడినవాడల్లే ] నే నింతదూరం రావటం వృధా కానందుకు చాలా సంతోషంగా వుంది. నే నడగానే మీరు నామాట ఒప్పుకుంటారని కల్లోకూడా అనుకోలేదు. ఉపేక్ష చేసినట్టయితే కొంపలు కూలిపోయేవి.

రాధ: అంత ప్రమాదం ఏమీలేదులెండి. నాకు ప్రాణం విసిగిపోయి త్వరలోనే విరమింతా మనుకుంటూనే ఉన్నాను.

దాసు: (మరింత సంతోషంతో) ఈసంగతి చెబితే మా శివం మరీ సంతోషిస్తాడు.

రాధ: ఇందులో సంతోషించేందు కేముంది లెండి. ఆయన్ని ఆసాంతం మోసపుచ్చాలని నాకెప్పుడూ ఉద్దేశంలేదు.

దాసు: (పారవశ్యంతో) నిజంగానా? అయితే నాప్రయత్నం పూర్తిగా ఫలించినట్టే—నే నిప్పుడన్న ముక్కలోవుండే అంతరార్థం మీ కొకనాటికన్నా తెలీకపోదు. సమయం వచ్చినప్పుడు నేనే చెబుతాను లెండి. ముందు మీరూ శివమూ పెళ్ళాడేస్తే, తప్ప. నేను హాయిగా గుండెమీద చెయ్యేసుకు నిద్రపోను.

రాధ: (తేలుకుట్టినట్లుగా కయ్యిమంటూ)—ఇదేమిటండోయ్?

మా మంచిమాటే చెప్పారే? ఈ సలహా చెప్పటానికా ఇంతదూరం వొచ్చారూ? చాల్లెండి.

దాసు: (చిన్నబుచ్చుకొని) — మీరు నా ఉత్సాహమంతా తగలేస్తున్నారు. మీ ధోరణిచూచి ఇప్పటికన్నా మీరు శివానికి న్యాయం చెయ్యటానికి తీర్మానించుకున్నారు గదా అని ఎంతో సంతోషించాను. మీరు శివాన్ని పెళ్ళాడటం మీ కనీస ధర్మం. కాదని ఏ పెద్దమనిషినన్నా అనమనండి. మీ ఉత్తరాలు—

రాధ: నే నా ఉత్తరాలు సదుద్దేశంతో టే రాశాను బాబూ అంటూంటే వినిపించుకోరే. పెద్దమనిషిహృదయం ఎంత భేదించిపోతోందో అని జాలిదలచి ఆ ఉత్తరాలు రాశాను. అంతే కాని, ఆయనగార్ని పెళ్ళాడాలనే దురుద్దేశం నాకెన్నడూ లేదు

దాసు: (కోపంతో) మీమీద నా కేర్పడ్డ మంచి అభిప్రాయమంతా ఈ ఒక్క ముక్కతోటే మంట గలిపేశారు. లోపల ప్రేమలేనప్పుడు మీ రా ఉత్తరాలు రాయవలసిన అగత్యం లేదు. ఆ ఉత్తరాలతో నా స్నేహితుణ్ణి మీరు నిష్కారణంగా రెచ్చగొట్టారు. లేనిపోని ఆశలు కల్పించారు.

రాధ: అటువంటి ఆశ నేను కల్పించానని ఆయనకుతో స్తే నేరుగా నా కాయన రాసి వుండవలసింది.

దాసు: (చిన్న గొంతుతో)—ఆ తప్పు నాదే. క్షమించాలి. నారహస్యం మీరు తెలుసుకుంటారని అనుమానం పోలేదు.

రాధ: ఇందులో మీ రహస్యం ఒకటుందా ఏమిటి?

దాసు : (బిడియంగా)-మరి ఎవరి సంతకంతోనో రాసిన ఉత్తరాలన్నీ రాసిందెవరనుకున్నారు ?

రాధ : (ఆశ్చర్యంతో)—ఆఁ ? ఏఁవిటీ? ఇంత మోసంచేసి, మీరే నాదగ్గిర కేమొహం పెట్టుకొచ్చి, ఇన్ని తిట్లు తిట్టారో ముందు చెప్పండి. నన్ను నోటికొచ్చిన మాటలన్నీ అన్నారే.

దాసు : క్షమించాలి. నావల్ల తప్పేజరిగింది. మీ యిద్దర్నీ ఎట్లాగయినా కలపాలనే సదుద్దేశంతోటే నేనా ఉత్తరాలు రాశాను.

రాధ : ఆమాటంటేనే నాకు మండుకొస్తేది. మమ్మల్నిద్దర్నీ కలపాలని మీ కెందుకా తహ తహ ? మీ శివంగారే గంగలో దూకితే నాకేం ?

దాసు : (బతిమాలుతూ) అలా అనకండి. కొంపతీసి నామీది కోపంకొద్దీ మీరు మా శివాన్ని పెళ్ళాట్టం మాత్రం మానకండేం ?

రాధ : శివమో! శివమో! ఆయనతో నాకేం ప్రసక్తి. నేనా గొడవంతా మానుకున్నానని చెప్పాను కానూ ?

దాసు : మీ రలా అనటం భావ్యంకాదు. ప్రేమ ప్రకటించటంలో మా శివం చవటే కావొచ్చుగాని, వాడికి మీ మీద నిజంగానే ఎంతో ప్రేమ ఉందని రూఢిగా చెప్పగల్ను-

రాధ : ఆయన ప్రేమతో ప్రసక్తి లేదు. ఆయన ఏ గంగలో దూకినా నేను కాదనను. ఎంతచెప్పినా నా అభిప్రాయం మీరు స్పష్టంగా గ్రహించకుండా ఉన్నారు.

దాసు : (విరక్తిగా) మీరంత నిక్కచ్చిగా చెప్పేసినాక ఇంక మాట్లాడి మటుకేం ప్రయోజనం? నాకిక సెల విప్పించండి. కాని వెళ్ళే ముందొక్క ముక్క చెపుతాను. మీ రిప్పుడు చేసుకోబోయే వివాహంకూడా తొందర పడి చేసుకోండి. మీలో అసలు ప్రేమించేశక్తి వుందా అని నాకు సందేహంగా వుంది. ఎంచేతనంటే! లోపల ఏమీ లేకుండా, అంతచక్కని ఉత్తరాలు రాశారంటే నే నిప్పటికి నమ్మకంలేకుండా ఉన్నాను. నామాటవిని మీరు పెళ్ళీ అదీ పెట్టుకోక హాయిగా కట్టుకథలు రాసుకోండి. మీ రేం రాసినా ప్రపంచాన్ని ఇట్టే నమ్మించగలరు. వస్తా నండీ, జానకీదేవిగారూ, దయవుంచండి.

రాధ : (మళ్ళీ తేలుకుట్టినట్టుగా) ఏమండోయ్. మీ పేరే మిటో, ఒక్కమాట. ఒక్కక్షణం కూచోండి.

దాసు : తిరిగివచ్చి—నాపేరు దాసంటారండి. ఎందుకు పిలిచారు?

రాధ : నేను రాసిన ప్రేమలేఖలు మీ రభినందించినప్పుడు మీరు రాసిన లేఖలను గురించి నా అభిప్రాయం వినరా?

దాసు : నా శక్తి సామర్థ్యాలు నే నెరక్కపోలేదు లెండి. నా రాతలో ఏమాత్రం పసవున్నా మీకూ, శివానికీ కలపలేకపొయ్యేవాణ్ణా?

రాధ : ఆయనమాట ఎత్తకండి. మీరు కృత్రిమంగా రాయలేదేమో, పాపం! ఆ ఉత్తరాలన్నీ మనస్ఫూర్తిగా రాసినవేనా?

దాసు : [ అనుమానిస్తూ ] —ఒక విధంగా మనస్ఫూర్తిగా

రాసినవనే చెప్పాలి. మీ ఉత్తరాలుచూసి నిజంగా మీకు హృదయం వుందనుకున్నాను.

రాధ : ఆ ఉత్తరాలద్వారా నన్ను మీ రేమాత్రమో ప్రేమించారేమో కదూ ?

దాసు : (నిర్భయంగా)—అవును. దాపరికం దేనికీ ? ప్రేమించాను. అయితే, నా కోసం కాదు, నా ప్రాణస్నేహితుడు శివంకోసం.

రాధ : అతని సంగతెత్తకండి బాబూ అంటే వినరే ? అయితేనూ, దాచకుండా చెప్పండీ. సొంతాన నా కో ప్రేమ లేఖ రాద్దామని మీకు కోరిక ఎన్నడూ పుట్టలేదూ ?

దాసు : నా ఉత్తరాలకి సమాధానంగా మీరు రాస్తున్నారు గనక ఒకవేళ అలాంటి తుచ్ఛమైన కోరిక ఎప్పుడన్నా పుడితే పుట్టి వుండుగాక, దాన్ని నిగ్రహించే శక్తి నాలో లేక పోలేదు. సుమండీ.

రాధ : నాకు ప్రేమలేఖలురాయాలనేది తుచ్ఛమైన కోరికా? ...చూడండీ, నే నందమైన మనుష్యుల్లో జతేనంటారా ?

దాసు : కావచ్చుగాక. శుష్క అందంలో ప్రయోజన మేమున్నదండీ ? హృదయమనేది లేకపోయిన తరవాత పై అందాలు దేనికి ?

రాధ : న న్నకారణంగా తిట్టిపోస్తున్నారు. నా ప్రేమలేఖలన్నీ పెద్దమనిషి తరహా అయినా పాటించకుండా చదివేసి నాకు హృదయంలేదని ఎట్లా అనగలుగుతున్నారో నా కర్థం కాకుండా వుంది.

దాసు : మీరు శివాన్ని వంచించారు. అతని మీద ప్రేమ లేకుండా అతనికి ప్రేమలేఖలు రాయటం!

రాధ : హృదయంలేని పని. అదేనా మీ రనేదీ ?

దాసు : నే నేమిటి ? ఎవరైనా అంటారు.

రాధ : అయితే మీరు చేసిన పనేం బాగుందీ ? నా మీద ప్రేమవుండే ఆ ప్రేమలేఖ లన్నీ రాశారా? అవి నా హృదయాన్ని ఎంత రెచ్చగొట్టాయో మీకేం తెలుసునూ ? నేను మీ స్నేహితుణ్ణి పెళ్ళాడనంటే నన్నన్ని మాట లన్నారే, నన్ను మీ రెందుకు పెళ్ళాడరాదూ ?

దాసు : కంగారుగా—ఇదిచాలా అన్యాయం.

రాధ : ఎందువల్లో ? నేను ప్రేమలేఖలు రాస్తే హృదయం తోటే రాయాలేం ? మీరుమటుకు హృదయం లేకుండా రాయొచ్చేం?

దాసు : నేను కనీసం మరో పేరుతో రాశానుకద ? ఒకవేళ నా లేఖలు మీ హృదయాన్ని కదిలిస్తే దానిఫలం ఇంకొక రనుభవించాలనిగద నా అభిప్రాయం.

రాధ : ఆ లేఖలు రాసేది మీ శివంగారు కాదని నేను కనుక్కున్నానుగా.

దాసు : దానికి నేను బాధ్యుణ్ణనడం ధర్మమూ ? కనుక్కో రనుకున్నాను.

రాధ : ఫోర్జరీ చెయ్యటమేనా మీ బాధ్యత ? మీ సంగతి కూడా నే నడగను. నా సంగతి చెప్పండి. ఎవరో నాకు ప్రేమ లేఖలు రాస్తున్నారని నాకు తెలుసును. ఆ లేఖల ద్వారా నే నాయన్ని ప్రేమించి జవాబులు రాశాను. ఆ

మనిషి నన్ను పెళ్ళాడటం కనీస ధర్మం, అవునంటారా? కాదంటారా?

దాసు : అసంభవం. నేను మిమ్మల్ని పెళ్లాడను. పెళ్లాడలేను. క్షమించాలి.

రాధ : క్షమించను. క్షమించలేను. ఎందుకని పెళ్లాడరో కాస్త చెబుతారా?

దాసు : నా మనస్సులో మీరు నా ప్రాణ స్నేహితుడైన—

రాధ : హరి హరీ!

దాసు : (మొండిగా) నా ప్రాణ స్నేహితుడైన శివం భార్య అయిపోయినారు ఆ భావం ఇక మారదు.

రాధ : అంటే నేను మీ భావంకోసం మీ స్నేహితుణ్ణి పెళ్ళాడనా?

దాసు : మానెయ్యండి. కాని నన్ను మాత్రం పెళ్ళాడ మనకండి.

రాధ : నన్ను పెళ్ళాడమని మిమ్మల్ని నేను కోరలేదే.

దాసు : ఇది చాలా అన్యాయం. ఇప్పుడేకదా నన్ను పెళ్ళాడ మని అడిగారు?

రాధ : పెళ్ళాడమంటే మీకెంత కష్టంగా ఉంటుందో తెలియజెప్పాను. ఆవిధంగానైనా నాస్థితి గ్రహించ గలుగుతారేమో నని.

దాసు : (నిస్పృహతో) అయితే నన్ను నిజంగా పెళ్ళాడాలని మీరు కోరనే లేదన్నమాట.

రాధ : చూశారా? మిమ్మల్ని పెళ్ళాడతా నన్నా మీ కోపమే. వొద్దన్నా కోపమే. నే నంటున్నానని కోప

గించుకోకండీ. మీకు అహంకారం జాస్తి. నన్ను పెళ్ళాడాలని మీ స్నేహితుడికే కోశానా లేదు. ఈ నిర్ణయం మీ అంతటే మీరే చేశారు. మీస్నేహితుడిచేత ఉత్తరాలు రాయించటానికి ఎంతో ప్రయత్నించారు. మీ స్నేహితుడు విన్లేదు. మీ కోపం వచ్చింది. ఆ ఉత్తరాలేవో మీరే రాశారు. కాని పని సాగలేదు. మీ స్నేహితుణ్ణి నాదగ్గరికి పంపాలని చూశారు. అతను కదల్లేదు. అప్పటికీ మీ అహంకారం అపజయం ఆమోదింపలేదు. బయల్దేరి చక్కా వచ్చారు. నావేపునించి ఏమన్నా కదలిక పుడుతుందేమో అని చూశారు. సాగలేదు. నన్ను తిట్టేశారు. ఇదంతా నిజమేనా ?

దాసు : ఆశ్చర్యం. చూసినట్టింత వివరంగా ఎలా చెబుతున్నారో. నే నూహించలేకుండా వున్నాను. మీ దగ్గర ఏదో గారడీ విద్య వుండాలి.

రాధ : వేరే గారడీవిద్య ఏమీ లేదు. నేను మీలాంటిదాన్నే.

దాసు : నా కర్థంకావటం లేదు.

రాధ : మీరు మీ స్నేహితుణ్ణి ఎన్ని తిప్పలు పెట్టారో, నేనూ మా జానకిని అన్ని తిప్పలూ పెట్టాను.

దాసు : మీ___.ఏమిటన్నారూ? మీరు జానకీదేవి గారు కారూ ?

రాధ : కాను, నాపేరు రాధ. నే నిక్కడ కాలేజీలో చదువుకుంటున్నాను.

దాసు : నన్నెంత ఫూల్ చేశారు. ఏం యిలాగ్గా మాట్లాడాను.

రాధ : మిమ్మల్ని మీరే ఫూల్ చేసుకున్నారు.

దాసు : (కొంచెం ఆగి) అయితే చూడండీ, మీ పేరేమి టన్నారూ ?

రాధ : రాధ.

దాసు : చూడండీ, రాధాదేవిగారూ ? నా ఉత్తరాలు నిజంగా మీకు నచ్చాయా ?

రాధ : మీరు కూడా కట్టుకథలు రాయటానికి పనికొస్తారనే తోస్తుంది.

దాసు : నేనొకటి రెండు కథలు రాశాను సుమండీ. టూకీగా చెప్పమన్నారా ?

రాధ : నాకాట్టే తొందరపనేమీలేదను కోండి. పరీక్షలుకూడా ఇంకా నాలుగురోజులదాకా లేవు.

దాసు : మరేం ? అయితే, చూడండి. ఈ కథ నాకు మొదటి సారి ఎప్పుడు సజెస్ట్ అయిందంటే మీరు డిసెంబరు 27 న ఉత్తరం రాశారు చూడండీ. ఆ ఉత్తరం నాకు 30 న అందింది. జనవరి ఒకటిలోపుగా నా మొదటి కథ రాసెయ్యాలని తీర్మానించుకున్నానూ, ఎంతకీ ప్లాటు దొరకలేదూ, ఇంతలో మీ ఉత్తరం వచ్చిందీ. ఆ ఉత్తరం అయిదారు సార్లు చదివేసి అవతల పెట్టేశానూ. ఇంతలో చట్టున చకచకిని భావం తగిలింది. వెంటనే... —

—o—

# తాజా ప్రచురణలు

## పం. జవహర్లాల్ నెహ్రూ ఆత్మకథ

ప్రపంచ శాంతికై అనవరత అద్భుత కృషి చేయుచు విశ్వప్రజానీకముచే లోకోత్తర పురుషుడుగ కొనియాడబడు చున్న మన ప్రధాని స్వీయ చరిత్ర. 1/8 డెమ్మీ సైజులో, చక్కని గ్లేజు కాగితం మీద ముద్రింప బడిన 772 పుటల మహాగ్రంథము. అందమైన బైండు. ఆకర్షణీయమైన రెండు రంగుల జాకెట్టు. వెల. రు. 10-0-0

## యమకూపం

రచయిత : అలెగ్జాండర్ కుప్రిన్

ప్రపంచ ప్రఖ్యాతిచెందిన మహోత్తమ నవల. వివిధభాషలలో లక్షలాది ప్రతులు అమ్ముడైన ఈ ప్రసిద్ధనవల ప్రతివారు చదివి తీరాలి. 370 పుటలు. మూడురంగుల ముఖచిత్రం.

వెల. రు. 4-0-0

## బాపిరాజు కథలు

అడివి బాపిరాజుగారి కథా సంపుటములు 1 అంజలి 2 రాగమాలిక 3 తరంగిణి అత్యంతాకర్షణీయంగా నూతన ముద్రణలు వెలువడినవి. విడిగా ఒక్కొక్కటి రు. 1-8-0. మూడు పుస్తకములు మేలైన గ్లేజు కాగితం పై ముద్రింపబడి ముచ్చటగా బైండు చేయబడిన లైబ్రరీ కూర్పు.

వెల రు. 5-0-0

---

## కుటుంబరావు నాటికలు

తెలుగు కథా రచయితలలో అగ్రగణ్యులుగా పేర్వడసిన శ్రీ కొడవటిగంటి కుటుంబరావు గారి రేడియో ప్రసా

రిత నాటికలు. ఇవి చదువుతూంటే పతితల హృదయాలను కుప్పిగంతులు వేయిస్తాయి.

1. కామినీ హృదయం 1-0-0
2. జీవితేచ్ఛ 1-0-0
3. యధార్థవాది 1-0-0

మొత్తం నాటికలు గ్లేజు కాగితం పై ముద్రింపబడి బైండుచేయబడిన లైబ్రరీ కూర్పు రు. 4-0-0

# పు న ర్జ న్మ

రచన:- బెల్లంకొండ రామదాసు ఆంధ్రనాటక కళా పరిషత్తు వారి ప్రథమ బహుమతి పొందిన స్టేజినాటకము. 1-8-0

# క థ లు

అబ్బాస్ కథలు [కె. ఎ. అబ్బాస్] హృదయాన్ని ద్రవింపజేసే కథలు రు. 1-4-0

వెర్రివాడు [టాల్‌స్టాయ్] రు. 1-8-0

పిల్లల తెలివితేటలు [ ,, ] పిల్లల ప్రశ్నలకు జవాబివ్వలేని పెద్దల తికమకలను తెలిపే సంభాషణలు రు. 0-12-0

పిల ల ప్రపంచ కథలు వినోదంపాటు విజ్ఞానం కలిగించే కథలు రు. 0-8-0

చదువుకున్న పిల్ల [జర్మను కథ] రు. 0-10-0

ఇంద్రజాలం రు. 0-8-0

శరత్ పిల్లల కథలు రు. 0-12-0

**ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ-2.**